జాతీయ జీవిత చరిత్ర గ్రంథమాల

# టిప్పు సుల్తాను

రచన

బి. షేక్ అలీ

అనువాదం

కె. ఎస్.ఎస్. శేషన్




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# విషయాను క్రమణిక

# ఉపోద్ఘాతము

తుపాను లాంటి టిప్పు సుల్తాను పరిపాలనా కాలము కొద్దిపాటిదే అయినా అనేక విధాల ప్రాముఖ్యత గాంచింది. భారతదేశంలో బ్రిటిషువారి అధికారాన్ని పట్టిష్ఠంగా ఎదిరించినందుచేత దీనికి అత్యంత ప్రాధాన్యత ఏర్పడింది. బెబ్బులి ధైర్యము, జాగిలపు పట్టుదల కలిగిన టిప్పు సుల్తాను వంటి మరే శత్రువును ఆంగ్లేయులు అంతవరకు ఎదిరించడం జరగలేదు. ఆంగ్లేయులను మనదేశం నుంచి తరిమివే యాలన్నది టిప్పు జీవిత లక్ష్యం. ఆ లక్ష్యాన్ని సాధించడానికై అతను అమిత ధనాన్ని, శక్తిని, అధికారాన్ని, చివరికి తన జీవితాన్నే వెచ్చించడానికి వెనుదీయ లేదు. నూరేండ్లు నక్కలాగ జీవించడం కన్న ఒక్క రోజు సింహంవలె మనడం మేలని టిప్పు అనేవాడు! జీవిత ధ్యేయాలతో రాజీపడడం, లక్ష్యాలను విస్మరిం చడం, పరాయివారికి దాసోహమనడం అతనెప్పుడూ ఎరగనివి. స్వదేశీ రాజుల మధ్య ఐక్యత లోపించినందున, బ్రిటిషువారి సైనికాధిక్యత చేత, వారి కుటిల రౌత్యనీతి వల్ల దేశ స్వాతంత్ర్యము కబళింపబడుతుందని అతను గ్రహించగలి గాడు. ఉదాత్తమైన గుణములు, ప్రజాక్షేమాన్ని పరిరక్షించాలి అనే ఉత్కంఠ టిప్పు సుల్తానులోని ప్రత్యేకతలు, ధైర్య సాహసాలలో, అనుకొన్నది సాధించాలనే పట్టు దలలో తండ్రికి మించిన తనయుడని టిప్పు పేరుపొందాడు. అనేక యుద్ధాలు చేస్తూ రాజకీయంగా అనేక ఒడుదుడుకులనెదుర్కొంటూ కూడా వ్యాపార, వాణి జ్యాలు, పరిశ్రమలు, వ్యవసాయం వంటివి ప్రజల ఆర్థికాభివృద్ధికి మిక్కిలి ప్రధా నమైనవనే సత్యాన్ని టిప్పు విస్మరించలేదు. పటిష్ఠమైన పరిపాలనా యంత్రాం గాన్ని ఏర్పరచి, ప్రభుత్వాన్ని నడపడంలో అనేక అధునాతన పద్ధతులను ప్రవే శపెట్టిన మొదటి భారతీయ పాలకుడు బహుశా టిప్పు సుల్తానే, అతను అనుస రించిన కొత్త పద్ధతుల మూలంగా మైసూరు చైతన్యవంతమైన కార్యక్రమాలకు కేంద్రంగా రూపొందింది. ప్రత్యేక వాణిజ్య విభాగమును అతను స్థాపించుట; రాజ్యపు నలుమూలలా పరిశ్రమలు ప్రారంభించుట; తుపాకులు ఫిరంగులు మొద

లైన యుద్ధసామగ్రిని తయారు చేయించుటకై దేశ విదేశాలనుంచి పనివారిని రప్పించుట; ప్రత్యేక నౌకాదళాన్ని ఏర్పరచుట; న్యాయవిచారణలో అతను ప్రవేశపెట్టిన సంస్కరణలు; నాణెములు, క్యాలెండరు మొదలైన వాటిని సంస్కరించుటలో తీసుకొన్న చొరవ; పరిపాలనలోని ప్రతి అంశములోను అతను చూపిన ఆసక్తి; వ్యవసాయభివృద్ధికి అతను చేసిన కృషి-వీటన్నిటి ఫలితంగా పదునెనిమిదవ శతాబ్దంలో మైసూరు సంపన్నమైనదిగానే కాక మిక్కిలి అభ్యుదయ రాజ్యంగా కూడ పేరు పొందగలిగింది.

**బి. షేక్ అలీ**

# 1

# పూర్వ రంగము

పదునెనిమిదవ శతాబ్ది మధ్య భాగంలో భారతదేశ వ్యాప్తంగా అస్తవ్యస్తమైన పరిస్థితులు నెలకొన్నాయని చెప్పవచ్చు. అనతికాలంలో అధికార శిఖరాలని అందుకోవడానికి చొరవగల ఎవరికైనా అవకాశాలు విందుగా వున్న సమయమది. అట్టి సమయంలోనే హైదరాలీ, టిప్పు సుల్తానులు మనదేశ రాజకీయరంగ ప్రవేశము గావించారు. వారిద్దరి కృషి ఫలితంగా మైసూరు అతి శక్తివంతమైన రాజ్యంగా రూపొంది, విదేశాలతో సంబంధాలు కూడా నెరపగలిగింది. అంతే కాకుండా వారు విదేశ అధికారాన్ని ప్రతిఘటించడానికై తమ సర్వస్వాన్నీ ఒడ్డినవారు. వారిద్దరి పరిపాలనలు అంగ్లేయులతో జరిపిన యుద్ధాలతో ప్రారంభమయి, అట్టి యుద్ధ సమయాలలోనే అంతముగావడం మరీ విశేషము. 1760 లో హైదరాలీ బ్రిటిషు వారితో మొదటిసారిగా యుద్ధము ప్రారంభించిన తర్వాత 1799 లో లార్డు వెల్లస్లీ టిప్పును ఓడించేంత వరకు "లండన్ నగరంలో గల లీడెన్‌హాల్ వీధిలోని బ్రిటిషు కంపెనీ కేంద్ర కార్యాలయానికి మైసూరు సింహస్వప్నమే అయింది." హైదరాలీ నేతృత్వంలోని మైసూరు సైన్యం "సైనిక శాస్త్రాభ్యాసానికి భారతదేశపు పాఠశాలగా పేరుపొందింది." ఐరోపావారి సైన్యాల పట్ల గల భయాందోళనలు అతనిపై ఎట్టి సమ్మోహనాశక్తిని ప్రదర్శించలేక పోయింది. "మన గోడలను అధిగమించడంలో అతని అశ్వాలకు రెక్కలున్నవేమో!" అనే అనుమానంగలిగేదని అలెగ్జాండర్ డవ్ తన చరిత్ర గ్రంథంలో వ్రాశాడు. అయితే టిప్పు మరికొంత ముందుకు వెళ్ళినవాడని చెప్పవచ్చు. అతను అనేక విదేశాలతో ముఖ్యంగా ఫ్రాన్సుతో సన్నిహిత సంబంధాల నేర్పరచుకొన్నాడు. బ్రిటిషువారితో మాత్రం నిర్దిష్టమైన ప్రతిఘటనా విధానాన్ని అనుసరించి వారి అధికారాన్ని ధ్వంసం చేయడానికి తన జీవితాంతం శ్రమించాడు.

హైదరాలీ అధికారానికి రాకముందు మైసూరు మారుమూలలోని ఒక చిన్న

రాజ్యము మాత్రమే. 1761 లో మూడవ పానిపట్టుయుద్ధము తర్వాత మహరాష్ట్రులు దక్షిణ భారత దేశ వ్యవహారాల్లో జోక్యం గలిగించుకొన్న కారణంగా మైసూరు ఒక రణరంగంగా మారింది. అదేవిధంగా నిజాం, ఫ్రెంచి, బ్రిటిషువారు కూడ ఈ ప్రాంతపు రాజకీయాలలో జోక్యం గలిగించుకొని తుల్యప్రాబల్యాన్ని నశింపజేశారు. 1762 నుంచి 1778 వరకు హైదరాలీ ఇరుగుపొరుగు రాజ్యాల నుంచి ముఖ్యంగా మహరాష్ట్రుల బారినుంచి తన రాజ్యాన్ని రక్షించడానికే శ్రద్ధ చూపాడు. అతి క్లిష్టమైన పరిణామాన్ని కూడ తనకు అత్యంత అనుకూలమయే విధంగా మార్చుకోగల దౌత్య సామర్థ్యమతనికి వుండేది. ఉదాహరణకు 1766 లో మహరాష్ట్రుల, నిజాం, బ్రిటిషువారు కలిసి మైసూరుపై యుద్ధాన్ని తలపెట్టారు. కానీ యీ సంఘటిత ప్రతిఘటనను బ్రిటిషువారిపై తీవ్రమైన దెబ్బతీయడానికి ఒక సదవకాశంగా హైదరాలీ మార్చగలిగాడు. అతను మొదట మహరాష్ట్రులు శత్రుపక్షంనుంచి ఉపసంహరింపజేసి, నిజాంను తన పక్షానికి త్రిప్పుకొని బ్రిటిషువారిపై విజృంభించడానికి తగు వీలు సృష్టించుకొన్నాడు. దీని ఫలితంగా రెండేండ్లు కొనసాగిన మొదటి మైసూరు యుద్ధం తనకు మిక్కిలి లాభదాయకంగా ముగిసింది. బ్రిటిషువారు మనదేశంలో గావించిన అన్ని యుద్ధాలలో ఇది అత్యంత నష్టదాయకమైంది. ఒక స్వదేశీ రాజ్యము మద్రాసు ముంగిట తమపై సంధి షరతులను నిర్దేశించిన కారణంగా బ్రిటిషు వారి ప్రతిష్ఠకు ఎంతో భంగంవాటిల్లింది. ఈ యుద్ధాన్ని కొనసాగింపజేసిన మద్రాసు ప్రభుత్వము ఆర్థికంగా నష్టపడటమే గాక తన ప్రణాళికలు భగ్నమైనందున నైతికంగా కూడ దెబ్బతిన్నది. అంతకుముందు భారతదేశంలో ఏ స్వతంత్ర రాజ్యమూ బ్రిటిషువారు అజేయులను అపోహను తొలగించ ప్రయత్నించలేదు. అందువల్ల హైదర్ తన విజయంపట్ల మిక్కిలి సంతోషించాడు. సెంట్ థోమ్, ఆరణి, కావేరీ పాక్, ప్లాసీ, మచిలీపట్నం, బక్సార్ వంటి యుద్ధాలన్నీ, యురోపియన్లకు అనుకూలమైన ఫలితాలనే ఇచ్చాయి. కానీ అట్టిది తారుమారైన కారణంగా యుద్ధము అత్యంత ప్రత్యేకతను సంపాదించుకుంది.

ఈ యుద్ధము ముగిసిన కొద్ది కాలానికే మహరాష్ట్రులు 1770 లో మళ్ళీ మైసూరుపై దండెత్తారు. మద్రాసు సంధిషరతుల ప్రకారము బ్రిటిషువారు హైదరాలీకి సహాయం చేయవలసివుంది. అందుచేత హైదర్ వేంటనే వారి సహాయాన్ని కోరాడు. కానీ అతని విజ్ఞప్తిని బ్రిటిషువారు పట్టించుకోలేదు. 1771 లో శ్రీరంగపట్టణానికి చేరువలోని చెంకురాలి వద్ద మహరాష్ట్రులచేత ఘోరఅపజ

.యాన్ని పొందాడు. అప్పటికీ బ్రిటిషువారు తన అభ్యర్థనని మన్నించి సహాయంచేయ ముందుకు రాలేదు. అర్కాటు నవాబు, మద్రాసులోని బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధి సర్ జాన్‌లిండ్సేల ఒత్తిడి మూలంగా మహరాష్ట్రులకు సహాయంచేసి హైదరాలీని నాశనం చేయడానికే బ్రిటిషువారు నిశ్చయించుకొన్నారు. హైదర్ పట్ల చూపిన నమ్మకద్రోహానికి కొద్ది సంవత్సరాలలోనే వారు విపరీత పరిణామాలను ఎదుర్కొనవలసి వచ్చింది. 1780 లో హైదరాలీ బ్రిటిషువారిపై పగ తీర్చుకోవడం ప్రారంభించాడు. కర్ణాటకపై దండెత్తి నలుదిశలా వీరవిహారము గావించి అనేక బ్రిటిషు సైనికులను వధించాడు. అదే సంవత్సరంలో బ్రిటిషువారికి, నిజాంకు వ్యతిరేకంగా భారతదేశంలోని ప్రధాన రాజ్యాలతో ఒక ప్రతిపక్షకూటమి ఏర్పాటయ్యింది. నానాసాహెబ్, సింధియా, భోస్లే, హైదరాలీ కలిసి బ్రిటిషు స్థావరాలను ముట్టడించ నిర్ణయించారు. 1780 జూలైలో హైదర్ తన పథకం మేరకు కర్ణాటక ప్రాంతంపై సేనల్ని నడిపించాడు. ఇది మద్రాసులోని బ్రిటిషు వర్గాలకు దిగ్భ్రాంతి గలిగించింది. ఒక్క వారం రోజుల్లో కాంచీపురాన్ని ముట్టడించి, పోర్టునోవొ వరకు వెళ్ళగలిగాడు. పొలిలూరు వద్ద జరిగిన యుద్ధంలో కల్నల్ బైలీ చిత్తుగా ఓడిపోయాడు. మద్రాసు రాష్ట్రమంతా ఇది సంచలనాన్ని గలిగించింది. బక్సార్ యుద్ధవీరుడుగా పేరుబడిన సర్ హెక్టర్ మన్రో బ్రిటిషుసేనలకు నాయకత్వం వహించి హైదరాలీకి వ్యతిరేకంగా పోరాటం కొనసాగించాడు. కానీ అతను దాదాపు 500 సైనికులను పోగొట్టుకొని తుపాకులను కాంచీపురం చెరువులో పారవేయించి మద్రాసుకు వెనుదిరగ వలసి వచ్చింది. ఆ సమయంలో హైదర్ ఆంగ్లేయ సైన్యాలను తరిమివేయగలిగివుంటే మద్రాసుని సునాయాసంగా వశపరచుకొని వుండేవాడని సర్ ఐర్‌కూట్ తర్వాత అభిప్రాయపడ్డాడు. కూట్ సేనలు బెంగాలు నుంచి వచ్చి అనేక విజయాలు సాధించి ఆదుకొన్నకారణంగా బ్రిటిషువారు తమ పరువు దక్కించుకోగలిగారు. కానీ దీనిచే పరిస్థితులలో పెద్ద మార్పులేవీ రాలేదు. హైదర్ కర్ణాటకలో చాల ప్రాంతాన్ని తన చేజిక్కించుకోగలిగాడు. మిత్రకూటమిలోని వారిలో శాయశక్తుల కృషిచేసి బ్రిటిషువారిని పటిష్ఠంగా ఎదుర్కొన్నది హైదర్ ఒక్కడు మాత్రమే. మహరాష్ట్రులు బ్రిటిషువారితో సాల్బై వద్ద ప్రత్యేక సంధి కుదుర్చుకొన్నారు.

కొద్ది నెలల తర్వాత 1782 డిసెంబరులో హైదర్ మరణించాడు. ప్రతిపక్షసమాఖ్య నేర్పరచుటలోనే గాక బ్రిటషువారిని శక్తివంతంగా ప్రతిఘటించే కార్యక్రమంలో కూడా అతని పాత్ర మిక్కిలి గణనీయమైంది. కంపెనీ ప్రభుత్వా

నికి అతను కలిగించిన నష్టము మరెవ్వరూ కలిగించలేదు. సింధియా కూడా బ్రిటిషువారితో రాజీపడ్డాడు. నిజాం ఒక్క తుపాకీగుండు కూడ పేల్చలేదు. నానా సాహెబ్ తన రాజ్యంలో అధిక భాగాన్ని బ్రిటిషువారికి పోగొట్టుకొన్నాడు. ఉదాత్త మైన సమిష్టి లక్ష్యముతో గాక వ్యక్తిగత దురాశలతో యీ రాజ్యాలు ఒకటయ్యాయి. అభీష్టాలు నెరవేరగానే మళ్ళీ యథాతథం పాత దారులే త్రొక్కి, వ్యక్తిగత అసూయలకు, పేచీలకు ప్రాధాన్యమిచ్చాయి. యుద్ధము ముగియకముందే హైదర్ మరణించాడు. దీనితో రాజకీయ ప్రాధ్యాన్యమంతా ఒక ఐరోపా వలస ప్రభుత్వ అధికారాన్ని కూలదోసే ప్రయత్నాన్నుంచి ఒక స్వదేశీ రాజ్యాన్ని సర్వనాశనం చేసే కార్యక్రమం వైపు మళ్ళింది. అంతకుముందు మైసూరుకు పోగొట్టుకొన్న ప్రాంతాలను పునరాక్రమించుకొనడానికి మహరాష్ట్రులు ఆసక్తిపరులయ్యారు.

# 2

# అధికారము చేపట్టుట, ఆంగ్లేయులతో యుద్ధము

హైదరాలీ మరణానంతరం ప్రసిద్ధి గాంచిన అతని కుమారుడు టిప్పు అధికారానికి వచ్చాడు. ధైర్యసాహసాలలో, సంకల్పసిద్ధిలో, ఉదాత్త భావాలలో అతను తండ్రిని మించినవాడు. 1750 నవంబరు 10 వ తేదీన కోలారు మండలంలోని దేవనహళ్ళిలో టిప్పు జన్మించాడు. అతను జన్మించడానికి ముందు టిప్పు తల్లి ఆర్కాటులోని టిప్పు మస్తాన్ఔలియ సమాధిని సందర్శించి పుత్రుని పొందడానికై పూజలు చేసిన కారణంగా అతనికి టిప్పు అని పేరు పెట్టడం జరిగింది. టిప్పు తాతగారి పేరు ఫతేమహమ్మదు అవటంవల్ల అతనికి ఫతే అలీ అని మరో పేరుగూడ వుండేది. హైదర్ వలెకాక టిప్పు సమకాలిక విలువలతో ముడివడిన పాండిత్యాన్ని పరిపాలనా మెలకువలను, యుద్ధ విద్యలను క్షుణ్ణంగా అభ్యసించాడు. చాల చిన్నవయస్సులోనే తండ్రి వెంట అనేక దండయాత్రలలో పాల్గొన్నాడు. 1763 లో హైదర్ మలబారును ముట్టడించినప్పుడు టిప్పుకు మొట్టమొదటిసారిగా యుద్ధ అనుభవము కలిగింది. మొదటి మైసూరు యుద్ధసమయంలో టిప్పు, నిజాంతో చాకచక్యంగా జరిపిన సంప్రదింపుల కారణంగా నిజాం అతనికి 'ఫతే అలీకాన్' అనే బిరుదునిచ్చాడు. ఆ యుద్ధపు చివరి ఘట్టంలో అతను మద్రాసు వరకు సైన్యంతో వెళ్ళి సైయింట్ థామస్ ప్రాంతంలోని మద్రాసు గవర్నరు కౌన్సిల్ లోని సభ్యుల ఇండ్లను కొల్లగొట్టాడు. 1769-72 మధ్యజరిగిన మైసూరు-మరాఠా యుద్ధంలో చురుకుగా పాల్గొన్నాడు. రెండవ మైసూరు యుద్ధం ప్రారంభమయే నాటికి అతను యుద్ధ నైపుణ్యంలోను దౌత్యరీతులలోను విశిష్ట అనుభవాన్ని గడించాడు. 1780 సెప్టెంబరులో కల్నల్ బైలీపై, 1782 ఫిబ్రవరిలో కల్నల్ బ్రైత్ వైట్ పై దెబ్బదీయడంలో అతను ప్రధానపాత్ర వహించాడు. హైదర్ మరణించే సమయంలో టిప్పు మలబారు తీరంలో కల్నల్ హంబర్ స్టోన్‌ను ఎదిరించడంలో నిమగ్నమై వున్నాడు.

టిప్పు అధికారానికి రావడం మాత్రం శాంతియుతంగానే జరిగింది. ఉత్తరంలో కృష్ణానదినుంచి దక్షిణములో దిండిగల్లు వరకు గల దాదాపు 400 మైళ్ళపొడవు, పడమర మలబారు నుంచి తూర్పు కనుమలవరకు ఉండే 300 మైళ్ల వెడల్పు గల అతి శక్తివంతమైన రాజ్య మతనికి సంక్రమించింది. కాని అట్టి తన విశాలమైన, సంపన్నమైన రాజ్యాన్ని చూసి ఓర్వలేని ప్రక్క రాజ్యాల మూలంగా టిప్పుకి తగిన రక్షణ లేకపోయింది. అందుచేత అమిత వ్యయ ప్రయాసలతో అతను జీవితాంతము యుద్ధాల వలయంలో గడపవలసి వచ్చింది. బ్రిటిషువారి దౌత్యాధిక్యత భారత దేశ రాజ్యాల కూటమిని ఛేదించడమే కాక మహారాష్ట్రులు తమకి సన్నిహితులయేట్లు చేసుకుని, టిప్పు తమ సంధిషరతులకి అంగీకరించేట్లు వత్తిడి చేశారు. సింధియా సహాయంతో అండర్సన్ టిప్పుకి వ్యతిరేకంగా ఒడంబడిక కుదుర్చుకోవడంలో నివగ్నమయ్యాడు. టిప్పు మలబారు వదలి కర్ణాటక చేరగానే, బ్రిటిషువారు మంగళూరు, బిద్నూరులను ఆక్రమించుకొన్నారు. టిప్పుని ఏదో విధంగా పదవీచ్యుతుని చేయడానికై మైసూరు రాణి, బ్రిటిషువారి సహాయంతో రహస్యంగా పథకాలు వేయ నారంభించింది. దీనికై కల్నల్ ఫుల్లర్టన్ దక్షిణంనుంచి శ్రీరంగపట్నం వెళ్ళాడు. అంతేకాకుండా బ్రిటిషువారు మలబారు ప్రాంతంలోని స్థానిక నాయకులను టిప్పుకి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని ప్రోత్సహించారు. ఆ విధంగా రాజ్యాన్నధిష్ఠించిన సమయంలో టిప్పు పరిస్థితి అనేక సమస్యలతో కూడుకొని మిక్కిలి దయనీయమైనదిగా తయారయింది.

అట్టి క్లిష్టపరిస్థితులను అధిగమించి టిప్పు దేశీయ, విదేశీ శత్రువుల దురుద్దేశాలను అమిత నేర్పుతో ఛేదించగలిగాడు. బ్రిటిషువారిపై మిక్కిలి సాహసంతో జరిపిన యుద్ధం మూలంగా వారే స్వయంగా శాంతిని కాంక్షించి సంధి ప్రయత్నాలను ఉపక్రమించారు. భీకర పోరాటం కొనసాగించే సమయంలో కూడ గౌరవప్రదమైన శాంతి ఒప్పందానికి శత్రువు అభిలషించిన పక్షంలో సంప్రదింపులకు తను అవకాశాన్ని నిరాకరించగూడదనే సిద్ధాంతాన్ని అనుసరించాడు టిప్పు. సాల్బై సంధితో మిత్రరాజ్యకూటమి అంతంకావడం, అంతకుముందు మైసూరుకి పోగొట్టుకొన్న ప్రాంతాలను తిరిగి ఆక్రమించుకోవడానికి మహారాష్ట్రులు జరిపిన కుట్రలు, మైసూరుతో హృదయపూర్వకంగా సహకారంలో నమ్మకములేని ఫ్రెంచివారి నిలకడలేని సిద్ధాంతాలు, ఐరోపా, అమెరికాలో బ్రిటిషువార్ల యుద్ధ కలాపాలను ముగించుకొని, భారతదేశంపై పూర్తిగా దృష్టిని కేంద్రీకరించడం-మొద

లైన కారణాలచే టిప్పు యుద్ధాన్ని ఒక కొలికికి తేవలసి వచ్చింది. అందువల్ల ఉత్తరోత్తరా బ్రిటిషువారిపై బలప్రదర్శనకు తగు శక్తిని పుంజుకునేందుకు వీలుంటుందని గూడ అతను తలపోశాడు.

అదృష్టవశాత్తు కొద్ది కాలంలోనే పరిస్థితులు టిప్పుకి అనుకూలంగా పరిణమించాయి. 1783 ఏప్రిల్ 27 వ తేదీన సర్‌ఐర్‌కూట్ మరణించాడు. అంతకు కొద్ది రోజులు ముందు 1783 మార్చిలో ఫ్రెంచి సేనానాయకుడు బుస్సీ 27 నౌకలు, 5,000 సైనికులతో భారతదేశం చేరుకొన్నాడు. అడ్మిరల్ సఫ్రేస్ అనే ఫ్రెంచి నౌకాదళాధికారి బ్రిటిషువారికి బెంగాలునుంచి వచ్చే సరఫరాలకు అంతరాయం కలిగించాడు. మద్రాసులో బ్రిటిషువారి ఖజానా ఖాళీ అయింది. వారికి ఆర్కాటు నవాబుతో తగాదాలు రోజురోజుకీ ఎక్కువయ్యాయి. టిప్పు ఆ సమయంలో కొన్ని మెరుపు దాడులు జరిపి మలబారు బిద్నూరులలో పోగొట్టుకొన్న ప్రాంతాలన్నిటినీ ఆక్రమించుకొన్నాడు. మద్రాసు ప్రభుత్వం ప్రతీకారంలో దాడి జరిపి టిప్పు దృష్టిని మళ్లించడానికై కడపను ముట్టడించింది. దీనిన టిప్పు అతి చాకచక్యంతో త్రిప్పికొట్టి ఆశాభంగము కలిగించినా దక్షిణం నుంచి చొచ్చుకొచ్చిన బ్రిటిషుసేనలు కొంత ముందుకు వెళ్ళగలిగాయి. మైసూరు పూర్వపు రాజైన నంజరాజ ఒడియారు యొక్క పట్టపురాణి లక్ష్మమ్మణి మైసూరు సింహాసనాన్ని ఏదో విధంగా తన కుటుంబానికి తిరిగి రాబట్టుకోవడానికై బ్రిటిషువారితో కలసి కుట్ర కొనసాగించింది. ఫలితంగా కల్నల్ లాంగ్ దక్షిణాదినుంచి బయలుదేరి కరూర్, దిండిగల్, మరికొన్ని కోటలను కూడా ఆక్రమించుకున్నాడు. తన సైన్యంలోని కొంతమంది నమ్మక ద్రోహులు కనిపెట్టి టిపు వారిని కఠినంగా శిక్షించాడు. జనరల్ స్టూవర్ట్ కడలూరు వద్ద సైనిక దిగ్బంధమునకు గురి అయ్యాడు. అందుచేత దక్షిణంలోవున్న సైన్యం అతనికి సహాయంగా వెళ్ళవలసిన అవసరం ఏర్పడింది. ఆవిధంగా రాణి పన్నాగాలు విఫలమయ్యాయి.

ఇంతలో ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలు మధ్య ఐరోపాలో సంధి కుదిరిందనే వార్త 1783 జూన్ 4 తేదీన మద్రాసు చేరింది. కడలూరులో పరిస్థితి మరీ క్లిష్టముగా వున్న కారణంగా బ్రిటిషువారు ఫ్రెంచి వారిచేత కాల్పులు విరమణ అంగీకరింపజేయడానికి తాపత్రయ పడ్డారు. ఫ్రెంచివారి సహాయంతో టిప్పు సైన్యం బ్రిటిషువారిని లొంగదీయడానికి వత్తిడి తెచ్చింది. కాని సంధి కుదిరిందనే వార్త పరిస్థితులను తారుమారు చేసింది. బుస్సీ కాల్పుల విరమణ వెంటనే ఒప్పుకొని టిప్పుని గూడ యుద్ధమునుంచి విరమించుకొమ్మని కోరాడు. టిప్పు మొదట

సంకోచించినా, ఫ్రెంచివారి పోటీ ఆవిధంగానైనా తొలగుతుందని, బొంబాయి సైన్యాలు పశ్చిమ తీరాన్ని మట్టడిస్తాయేమోనని, దక్షిణం నుంచి మద్రాసు సైన్యం విజృంభించ వచ్చని, తన ఉద్దేశాన్ని మార్చుకొన్నాడు. 1783 ఆగష్టు 2వ తేదీన అతను మంగళూరు వద్ద బ్రిటిషువారితో ఒక ఒడంబడికకు ఒప్పుకొన్నాడు. దానితో తూర్పు, పడమటి తీరాలలో యుద్ధము తాత్కాలికంగా ఆపుజేయబడింది.

ఒడంబడిక షరతులను బ్రిటిషువారు హృదయపూర్వకంగా అమలు జరుప లేదు. పరిస్థితి కొద్దిగా మెరుగుపడడంలో దక్షిణంనుంచి మళ్ళీ ఎదుర్కొనడం ప్రారంభించారు. లాంగ్ స్థానంలో క్రొత్తగా నియమించబడిన కల్నల్ ఫుల్లర్‌టిన్ 1783 నవంబరులో పాల్ఘాట్, కోయంబత్తూరులను ఆక్రమించాడు. ఒడంబిక షర తులను విస్మరించి బొంబాయి నుంచి జనరల్ మెక్లియాడ్ మంగళూరులోగల సేనలకు కావలసిన సరకులను అందజేశాడు. ఒడంబడిక సూత్రాలను ఆ విధంగా కాలదన్నడం సహించని టిప్పు మంగళూరులోని బ్రిటిషు సైన్యాన్ని లొంగిపోవ లసినదిగా అదేశించాడు. మంగళూరును కైవసం చేసుకొనడం టిప్పుకి గొప్ప అనుకూలంగా పరిణమించింది.

యుద్ధసమయంలో ఫ్రెంచివారి ప్రవర్తన టిప్పు దిగ్భ్రాంతి చేసింది. బుస్సీ నాయకత్వంలోని ఫ్రెంచి సైనిక సహాయం కోరినప్పుడెల్ల దొరకుతుందిని చెపుతూ వచ్చిన ఫ్రాన్సు ఐరోపాలో సంధి కుదిరిన మరుక్షణమే భారతదేశంలో యుద్ధ విరమణ చేయడం స్వదేశీ రాజులందరినీ ఆశ్చర్యపరచింది. సంధి వార్త తెలి సిన వెంటనే బుస్సీ టిప్పుని యుద్ధాన్నుంచి విరమించుకోమని కోరాడు. అంతే కాకుండా కొసిగ్ని నాయకత్వంలో టిప్పుకి సాయంచేయడానిక పశ్చిమతీరం వెళ్ళిన ఫ్రెంచి సైన్యాన్ని వెనక్కు రమ్మని ఆదేశించి టిప్పుకి అగ్రహం కలిగిం చాడు. చివరికి టిప్పు కొలువులో జీతం పుచ్చుకుంటున్న లాలి. బొక్సిలాబ్ వంటి ఫ్రంచి నాయకులు పోరాటం కొనసాగడానికి నిరాకరించారు. వర్సే సంధిలోని పదహారవ నిబంధన మేరకు ఇంగ్లండు, ఫ్రాన్సులు మాత్రమే కాక వాటి మిత్ర రాజ్యాలకు కూడ శాంతి పరిరక్షణలో భాగముందని, భారత దేశంలో ఫ్రెంచి వారు తమ స్థావరాలను తిరిగి పొందడానికి టిప్పు యుద్ధవిరమణ చేయడం తప్పనిసరియని బుస్సీ వాదన. నిజానికి బుస్సీ శాంతిస్థాపనకు తానే కారకుడనే పేరు ప్రఖ్యాతులు పొందటానికి తాపత్రయపడ్డాడు. 1783 ఆగస్టు 2 వ తేదీన కుదిరిన ఒడంబడికతో బుస్సీ తన అభీష్టములో కొంత సాధించాడు. తక్కినది కూడ సాధించే ఉద్దేశముతో టిప్పు వద్దకు, మద్రాసులోని బ్రిటిషువారి వద్దకు

రాయబారుల్ని పంపి శాంతి సాధనకు ప్రయత్నించాడు. కానీ వారిద్దరిలో ఒకరు కూడ బుస్సీ మధ్యవర్తిత్వాన్ని అంగీకరించలేదు. అందుచేత అతను మిక్కిలి నిరుత్సాహపడ్డాడు. అంతకు ముందు గల తన సైనిక అపజయాలన్నిటినీ ఒక దౌత్యవిజయంతో కప్పిపుచ్చడానికి చేసిన ప్రయత్నం విఫలమైంది. రెండవ మైసూరు యుద్ధంలో ఆ విధంగా ఫ్రెంచివారు వేసుకొన్న పథకాలకు, చేసిన వాగ్దానాలకు, జరిగిన ఫలితాలకు పొత్తు కుదరనందున మిక్కిలి వివాదగ్రస్తమైంది. స్వదేశీ రాజులందరూ బ్రిటిషు వారితో యుద్ధములో మునిగివున్న సమయంలో ఫ్రెంచి వారికి భారతదేశంలో తమ అధికారాన్ని పునరుద్ధరించుకోవడానికి ఒక మంచి అవకాశమే లభించింది. కాని అట్టి సదవకాశాన్ని ఫ్రెంచివారు చేజేతులా జారవిడుచుకొన్నారు. బలంలోగాని నమ్మకములోగాని ఫ్రెంచివారికి టిప్పుకి మించిన సన్నిహితుడు దొరికేవాడుకాదు. కానీ తమ అనుమానాలతో అలక్ష్య వైఖరితో తమకు తాముగా అపార నష్టాన్ని కోరి తెచ్చుకొన్నారు.

బిద్నూరు, మంగళూరులు ఆక్రమణ జరగడంతో తమకు గలిగిన ఆర్థిక నష్టము. ప్రతిష్ఠాభంగము, ఇతర గడ్డుపరిస్థితులు, బ్రిటిషు వారిని టిప్పుతో సంధికై నిర్బంధించాయి. వారన్ హేస్టింగ్సుకు బొత్తిగా ఇష్టము లేకపోయినా, మద్రాసు గవర్నరు లార్డు మెకార్ట్నె టిప్పుతో సంధిచేసుకోవడానికి ఇష్టపడి స్వయంగా సంధి ప్రయత్నాలు ప్రారంభించాడు. 1783 ఫిబ్రవరిలో తంజావూరు రాజువద్ద వకీలయిన శంభాజీని టిప్పు వద్దకు రాయబారము పంపి, తమ తమ ప్రాంతాలను పునరుద్ధరించుకొని యుద్ధ ఖైదీలను మార్పుచేసుకోవడానికి ఇష్టపడుతున్నాడేమో కనుక్కోమన్నాడు. ఈ షరతులు అంగీకార యోగ్యంగా లేనట్లయితే మైసూరు సరిహద్దులోగల పుదుక్కోట, మల్పాడి మొదలైన ప్రాంతాలనిచ్చి అయినా సంధికుదుర్చుకోవడానికి మద్రాసు ప్రభుత్వం మొగ్గుచూపింది. కానీ ఇది నచ్చని వారన్‌హేస్టింగ్స్, అంగ్లేయుల ఆసక్తి కేవలం టిప్పుని మరింత అడిగి పుచ్చుకోవడానికో లేదా యుద్ధాన్ని మరింత పట్టుదలతో కొనసాగించడానికో మాత్రమే దోహదం చేస్తుందని; ఒకవైపు శాంతిని కాంక్షిస్తూ మరోవైపు యుద్ధ ఖర్చులను రాబట్టుకోవడానికి ప్రయత్నించడం విడ్డూరమని, యిట్టి సిద్ధాంతము భారత దేశంలో ఫలించదని తేలియజేశాడు. శాంతి స్థాపనలో తమ సదుద్దేశాన్ని వ్యక్తీకరింపజేయడానికై ముందుగా యుద్ధాన్ని ఆపుచేయడంలో మద్రాసు తీసుకొన్నచొరవను బెంగాలు ప్రభుత్వం దుయ్యబట్టింది.

అట్టి ఆక్షేపణలేవీ లెక్కచెయ్యక మెక్కార్ట్నె అనేక సూచనలుగల పట్టీలతో

1783 అక్టోబేరులో మద్రాసు చేరుకొన్న టిప్పు యొక్క వకీళ్ళతో మంతనాలు కొనసాగించాడు. వెంటనే వకీళ్ళతో ఒప్పందాలు కుదరనందున అన్ని అంశాలను విశదంగా చర్చించడానికై ఒకరిద్దరు కమీషనర్లను టిప్పు వద్దకు పంపడానికి మెక్కార్ట్నె అంగీకరించాడు. సారంగా, కౌన్సిల్‌లో సీనియర్ సభ్యుడైన సాడ్లియర్‌ని, గవర్నరు యొక్క అంతరంగిక కార్యదర్శియైన స్టౌంటన్‌ని టిప్పువద్దకు 1783 నవంబరులో పంపటంజరిగింది. కాని తమ ఆక్రమణలో వున్న స్థలాలు, ఖైదీలలో ఏది ముందు మార్పుచేయాలన్న అంశంపై ఆ ఇద్దరి కమీషనర్లలో ఏకాభిప్రాయం కుదరనందుచేత, హడ్లస్టన్ అనే వ్యక్తి అధికారాలతో కమీషన్‌లో మరో సభ్యుడిగా నియమించబడ్డాడు. కమీషనర్లు మంగళూరు చేరి టిప్పుకి ఒక పత్రాన్ని సమర్పించారు. అందులోని అంశముల ప్రకారం టిప్పు కర్ణాటక ప్రాంతాన్ని వెంటనే వదిలి, సాల్బైసంధి షరతులమేరకు తన వద్దగల బ్రిటిషు కైదీలను విడుదలచేయాలి. సాల్బైసంధి ప్రస్తావన టిప్పుకి ఆగ్రహాన్ని కలిగించింది. కర్ణాటకలో కొన్ని ప్రాంతాలు మైసూరుకు అప్పజెప్పాలని తనను వదలి బ్రిటిషువారి పక్షం చేరిన అయాజ్‌ను వెంటనే విడిపించాలని కోరుతూ తన షరతులను టిప్పు కమీషనర్లకు తెలియజేశాడు. వీటికి అంగీకరించని కమీషనర్లు తమ మరికొన్ని సరిక్రొత్త షరతులను టిప్పు ముందుంచారు. ఆక్రమణలో వున్న స్థలాల బదలీలాంటి అన్ని అంశాలను సర్దుబాదు చేయడం మిక్కిలి కష్టతరమైన పని. కాని ఇరుపక్షాలు శాంతిని గాంఢంగా కోరుతున్నందుచేత, ఆంగ్లేయులు డిండిగల్లు, కన్ననూరులను తమ ఆధీనములో కలిగి వున్నంతవరకు టిప్ప ఆర్కాటు, సాత్తుగర్‌లను స్వాధీనములో వుంచుకోవచ్చని అంగీకరింప బడింది. యుద్ధఖైదీలందరినీ విడుదల చేసిన తరువాత తమ ఆధీనములోని ప్రాంతాలను వదలిపెట్టాలి. 1784 మార్చి 11వ తేదీన సంధి పత్రముపై సంతకాలు చేయటం జరిగింది.

బ్రిటిషుయుగపు భారతదేశ చరిత్రలో మంగళూరు సంధికి అత్యంత ప్రాధ్యాన్యత వుంది. అంతరంగిక కుట్రలు తలలెత్తుతు, ఫ్రెంచివారు యుద్ధం నుంచి విరమించుకొని సహాయము నిరాకరించిన సమయంలో మహరాష్ట్రులు పాతపగ తీర్చుకోవడానికై బ్రిటిషువారితో చేతులుకలుపుతామని బెదిరించే తరుణంలో, అప్పుడప్పుడే అధికారానికి వచ్చిన టిప్పు తన షరతులను ఆంగ్లేయులచే అంగీకరింప జేయడంవల్ల ఇది అతనికి ఘనవిజయమని చెప్పవచ్చు. స్వదేశీ రాజులతోగల బ్రిటిషు సంబంధాల పరిధిలో ఆంగ్లేయులకు అనుకూలంగా లేని సంధి బహుశా 1769 లోని సంధికి మినహా మరేదీలేదు. కానీ ప్రస్తుతపు సంధి విషయంలో ఇది జరగలేదు. అనేక

విధాల యీ సంధి టిప్పుకు అనుకూలమైంది. మంగళూరు, బిద్నూరు పోగొట్టుకోవడం వల్ల, మహరాష్ట్రులు బ్రిటిషువారితో కలసి ఉగ్రరూపం దాల్చడం చేత, అమెరికాలోను ఐరోపాలోను బ్రిటిషువారు పోరు సాధించిన కారణాలచే యుద్ధము విపరీత పరణామాలు దాల్చ నారంభించిన సమయంలో అధికారానికి వచ్చిన టిప్పు అట్టి సుదీర్ఘ యుద్ధాన్ని గౌరవప్రదమైన ముగింపుకు తేగలిగాడు. టిప్పుని ఏదో విధంగా తమ వలయంలోకి లాగాలని లేదా అంతకు ముందు తాము పోగొట్టుకొన్న ప్రాంతాలను మైసూరు నుంచి పొందాలని కాంక్షించిన మహరాష్ట్రులకు ఈ సంధి ఆశాభంగమే కలిగించింది. మంగళూరు సంధి మరి రెండు విధాలుగా గూడ మహరాష్ట్రుల ప్రయోజనాలకు అంతరాయం కలిగించింది. సాల్బైసంధి ప్రకారం ఆంగ్లేయులకు, టిప్పుకి మధ్య శాంతికై మధ్యవర్తిత్వం వహించే బాధ్యత మహరాష్ట్రులకుండేది. కానీ ఇది మంగళూరు సంధి సమయంలో విస్మరించబడింది. సాల్బై సంధిలో రక్షణకై మిత్ర కూటమిని ఏర్పరచుకునే వీలు మహరాష్ట్రులకు కల్పించబడింది. కానీ అన్ని రాజ్యాలు ఖచ్చితమైన తటస్థవిధానాన్ని అనుసరించాలని మంగళూరు సంధి నిర్దేశించినందువల్ల, ఆ సౌకర్యం గూడ హరింపబడింది. తాను స్వయంగా టిప్పుపై దెబ్బతీయడానికి పథకాలను పూర్తిచేసే సమయంలో సింధియా యొక్క మధ్యవర్తిత్వం లేకుండా మద్రాసు ప్రభుత్వం ప్రత్యేక సంధి కుదుర్చుకోవడాన్ని నానాసాహెబ్ గర్హించి మంగళూరు వద్ద జరిగిన లావాదేవీలన్నిటినీ తీవ్రంగా ఖండించాడు. కొద్దికాలం తరువాత మహరాష్ట్రులు మైసూరును ముట్టడించినప్పుడు బ్రిటిషువారు తాటస్థ్యము వహించి మహరాష్ట్రులకు సహాయాన్ని అందించాడనికి మంగళూరు సంధిషరతులు అడ్డమవుతున్నాయని సాకి చెప్పి మిన్నకుండిరి.

బ్రిటిషువారిని యుద్ధవిరమణకై కక్కుర్తి పడజేయించి సంధి షరతులను అంగీకరింపజేయుటచే టిప్పు మిక్కిలి సంతృప్తిచెందాడు. బ్రిటిషువారికి అట్టిస్థితి కలగడానికి అనేక కారణాలున్నాయి. వారి మాటల్లోనే చెప్పాలన్న "నిర్జన ప్రాంతాలు, భీకరమైన కరవు, ఖాళీ ఖజానా, ఎంత ప్రయత్నించినా దొరకని అప్పులు, పరి పాలనకగు అధిక వ్యయము, నిలకడలేని ఆర్థికాదాయము, సర్వత్రా తాండవిం చిన నిరుత్సాహము అన్నీ కలసి ఆ సమయంలో ఎటువంటి సంధికైనా అంగీక రించునట్లు చేశాయి."[1] వారన్ హేస్టింగ్స్ యీ సంధికి కారకుడైన అధికారులం దరినీ ఉద్యోగాలనుంచి తొలగించడానికి ఒక సందర్భంలో యోచించినాడనే

[1] చూడు: Military Sundry Book, Vol. 60 B P. 367.

విషయం యీ సంధి బ్రిటిషువారికి ఎంత ఆశాభంగం కలిగించిందో ఊహించవచ్చు. ఇది మిక్కిలి "అవమానకరమైన ఒప్పందము"ని అతను బహిరంగంగా పేర్కొన్నాడు. వీలైనంత త్వరలో దీనిని త్రోసిపుచ్చడానికి అందరూ కృషి చేయవలసిందని ఉద్బోధించాడు సర్ హెక్టర్ మన్రో. మొదటి మైసూరు యుద్ధం తర్వాత బ్రిటిషువారికి కలిగిన రెండవ పెద్ద దెబ్బే యిది. టిప్పు ఆ విధంగా తన పరిపాలనా కాలపు మొదటి ఘట్టంలో తన అధికారాన్ని నేర్పుగా నిలద్రొక్కుకోగలిగాడు. సాధారణంగా భారతదేశంలో వారసత్వపు సమస్య అతి క్లిష్టమైంది, అందులోనూ ఒక రాకుమారుడు యుద్ధ సమయంలో సింహాసనానికొచ్చినపుడు ఇది మరీ అనిశ్చితితో కూడుకొన్నది. కాని టిప్పు మిక్కిలి విజయవంతంగా కష్టాలను అధిగమించి తన శత్రువుల ఆటకట్టగలిగాడు. బ్రిటిషువారికి తమ ఆధీనంలోని మూడు రాష్ట్రాల నుంచి మాత్రమేగాక మాతృదేశం నుంచి కూడ కావసిన సైన్యాలు, సామగ్రి, ఇతర సహాయలని తెప్పించుకోగల వీలుంది. టిప్పుని ఓడించే దాక అతనితో సంధి చేసుకోవడాన్ని గవర్నర్ జనరల్ వారన్‌హేస్టింగ్స్ వ్యతిరేకించాడు. మైసూరు కోస్తాప్రాంతంపై తన నౌకాదళాన్ని పంపి టిప్పుని కలవరపరచగల శక్తి బొంబాయి రాష్ట్రానికుంది. తూర్పు, దక్షిణ దిశల నుంచి మద్రాసు సైన్యాలు చొచ్చుకొని రావడంచేత పశ్చిమ ప్రాంతాలను రక్షించుకోవడం టిప్పుకి ప్రధాన సమస్యగా పరిణమించింది. దీనికి తోడు బ్రిటిషువారి సహాయంతో టిప్పుని గద్దె దించడానికి మైసూరు రాణి చేసిన కుట్ర, కృష్ణానదీ తీరంలోని ప్రాంతాలను కైవసం చేసుకోవడానికి మహారాష్ట్రులు అవలంభించిన చర్యలు, ఫ్రెంచివారు యుద్ధవిరమణ చేయడం-ఇవన్నీ మిక్కిలి సోచనీయ పరిస్థితులను కలిగించాయి. కానీ ప్రతిభాప్రపత్తులకు ప్రబల నిదర్శనము.

# 3

# మహారాష్ట్రులతో, నిజాంతో యుద్ధాలు

మధ్యవర్తులుగా వ్యవహరించవచ్చని, మైసూరుకు ఉత్తరంగా ఒకప్పుడు తమ అధీనములోని ప్రాంతాలను తిరిగి కైవసము చేసుకోవచ్చని ఆశించిన మహారాష్ట్రులకు ఆశాభంగము కలిగించిన మంగళూరు సంధి ఉత్తరోత్తరా సంభవించిన తగాదాలకు మూలకారణమైంది. రెండవ మైసూరు యుద్ధం తర్వాత టిప్పుపేరు ప్రతిష్ఠలు పెరిగిన కారణంగా చుట్టుపక్క రాజ్యాలకు అసూయ కలగడం ప్రారంభమైంది. కృష్ణానది ప్రాంతములో పూర్వము పోగొట్టుకొన్న ప్రాంతాలను మహారాష్ట్రులు మరచిపోలేదు. హైదర్ మరణానికి ముందు నానాసాహెబ్ ఆ ప్రాంతాలను స్వాధీనపరచమని, అట్లా చేయకుంటే బ్రిటిషువారితో చేతులు కలుపుతానని బెదిరించాడు. హైదర్ మరణము అలాంటిది సాధించడానికి మంచి అవకాశంగా తోచింది. కాని టిప్పు లొంగడానికి నిరాకరించాడు. దానిపై సింధియా టిప్పుకు వ్యతిరేకంగా సైనిక ఒప్పందానికై బ్రిటిషువారిని సంప్రదించాడు. నానా సాహెబ్ సహకారం ఎలాగూ వుంది. 1783 అక్టోబరు 13 వ తేదీన సింధియాకు బ్రిటిషువారికీ సంధి కుదిరింది. దాని ప్రకారం కర్ణాటకలోని ఆక్రమిత ప్రాంతాలను అప్పజెప్పమని తనవద్దగల ఖైదీలను విడుదలజేయవలెనని నానా టిప్పుని కోరాలి. దానికి టిప్పు పై యుద్ధం ప్రకటించాలి. కాని నానాసాహెబ్‌కు సింధియాతో అభిప్రాయభేదాలేర్పడిన కారణంగా యీ సంధి అమలు జరగలేదు. టిప్పుపై కత్తి కట్టడానికి నానా నిజాంతో గూడ మంతనాలు ప్రారంభించాడు. కాని మహారాష్ట్రులు ఉద్దేశాలను పసిగట్టిన టిప్పు ఇంతలో బ్రిటిషువారితో యుద్ధాన్ని ముగించి మహారాష్ట్రుల ఆట కట్టాడు. దీనితో మైసూరు మహారాష్ట్రుల సంబంధాలు మరీ దిగజారినాయి.

నిజాం 1761 లో అధికారానికి వచ్చిన నాటినుంచి మైసూరుతో సన్నిహితంగా లేడు. దక్షిణాదికంతకు సర్వాధికారియని భావించిన నిజాం మైసూరు అధి

నేతలైన హైదర్, టిప్పు తనకు విధేయులై వుంటారని భావించాడు. తన అభిప్రాయాలను అమలుజరిపించడానికి తగిన శక్తిసామర్థ్యాలు లేనికారణంగా మైసూరు నవాబుల అధికారాలని ఎదిరించడానికి తమ అవకాశానికై ఎదురు చూడసాగాడు. బ్రిటిషువారుగాని, మహారాష్ట్రులుగాని, మైసూరు పై యుద్ధం ప్రకటించినప్పుడల్లా నిజాం తనకు అనువైన విధంగా అందులో ప్రవేశించేవాడు. హైదరాబాదులో సదా ఒక వర్గం నిజాం మైసూరుకు సన్నిహితం కాకుండా చేయడానికి ప్రయత్నిస్తూవచ్చింది. హైదరాలీ టిప్పు సుల్తానులు అక్రమంగా సింహాసనాన్ని ఆక్రమించుకున్నారని భావించిన నిజాం వారికి తగు మర్యాద నివ్వడానికి నిరాకరించాడు. దీనితోబాటు మహారాష్ట్రులవలె నిజాం తన ఆధీనంలోని కొన్ని మండలాలను హైదర్ ఆక్రమించుకొని మైసూరులో విలీనంచేయడాన్ని గురించి గర్హించాడు. ఇది మహారాష్ట్రులకు, నిజాంను దగ్గరికి చేర్చి వారి మనోరథాన్ని నెరవేర్చుకోవడానికి, సైనిక ఒప్పందం కుదుర్చుకోవడానికి దోహదం చేసింది. యుద్ధం ప్రకటించడానికి మహారాష్ట్రులకు ఏదో ఒక సాకు లేకపోలేదు. దాదాపు నాలుగేండ్లు టిప్పు వారికి కట్టవలసిన పన్ను కట్టలేదు. మహారాష్ట్రులకు గల పన్ను వసూలు అధికారమును టిప్పు ప్రశ్నించలేదు కాని బ్రిటిషువారిపై తాను సాగిస్తున్న యుద్ధం కారణాన తనవద్ద డబ్బు నిలవలు లేవని చెల్లించడాన్ని దాటవేశాడు. నానాసాహెబ్ టిప్పుకి వ్యతిరేకంగా సైనిక ఒప్పందం కుదుర్చుకోవడానికై కృష్ణారావు భల్లాల అనే తన వకీలును హైదరాబాదు నిజాం వద్దకు పంపాడు. సింధియా, మహారాష్ట్రుల విషయాలలో జోక్యం కలిగించుకోవడంచేత నానాసాహెబ్ అతనితో తగాదాపడి నిజాం పక్షంచేరి సింధియాను సాధించదలిచాడు. నిజాం-నానాసాహెబ్‌లు ఎప్పుడూ లేనంత సన్నిహితులయ్యారు. టిప్పుని ఎదిరించి మహారాష్ట్రుల ఎల్లలను విస్తరింప చేయడం కన్న మంచిపని ఏదీ తోచలేదు. నానాని స్వయంగా కలుసుకోవడానికి నిజాం అంగీకరించాడు. కృష్ణ-భీమ నదుల సంగమస్థలమైన యాదగిరి వద్ద 1784 జూన్ నెలలో ఇద్దరూ సమావేశమయ్యారు. తరువాత సంవత్సరమే వారు యుద్ధం ప్రకటించడానికి అంగీకరించారు. పూర్వం వారు పోగొట్టుకొన్న ప్రాంతాలను ఆక్రమించుకొన్న తర్వాత మైసూరుని పూర్తిగా స్వాధీనపరచుకొని ఇద్దరూ సమానంగా పంచుకోవడానికి అంగీకరించారు. ఆ సమయంలో టిప్పు తన ప్రక్క రాజ్యాలను స్వయంగా ఎదిరించక తనపైకి ఉద్దేశించబడ్డ దండయాత్రలను మాత్రము ప్రతిఘటించాలనే సిద్ధాంతాన్ని అనుసరించాడు.

1785 లో టిప్పు తన సామంత జమీందారులలో ఒకడైన నర్గుంద దేశాయితో ఏటా కట్టవలసిన కప్పాన్ని అధికముచేసే హక్కు విషయంలో తగాదా ఏర్పడింది. ఈ తగాదా కడపటికి 1785-87 లో జరిగిన మైసూరు-మహరాష్ట్రుల యుద్ధానికి కారణమైంది. నర్గుంద మైసూరు దక్షిణాన గల ఒక చిన్న రాజ్యము. 1778 లో హైదరాలీ ఈ రాజ్యాన్ని జయించి దాని అధిపతియైన వెంటకరావు భావే అనే ఒక బ్రహ్మణ దేశాయిని తనకు కప్పం కట్టేటట్లు, మైసూరు ఆధిపత్యాన్ని అంగీకరించేటట్లు చేశాడు. 1780 లో బ్రిటిషువారికి వ్యతిరేకంగా స్వదేశీ రాజ్యాల కూటమి ఏర్పడడానికి ముందు నానాసాబహెబ్ ఆ రాజ్యం పై హైదరాలీ అధికారాన్ని గుర్తించాడు. దేశాయి తనకి వ్యతిరేకంగా కొనసాగించిన కార్యకలాపాల వలన మైసూరు యుద్ధానంతరం టిప్పు నర్గుందపై దృష్టి మళ్ళించాల్సిన అవసరముందని తలచాడు. పీష్వా మాత్రమే తన సర్వాధికారియని భావించి నర్గుంద నాయకుడు పూనాలోని పలుకుబడి వర్గాలతో మైసూరుకు వ్యతిరేకంగా ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించాడు. చింతామణిరావు పట్వర్ధన్‌లాంటి కొంతమంది మరాటా నాయకులను మైసూరుని జయించవలసిందిగా ప్రోత్సహించాడు కూడ. కానీ అతని పథకాలను మహరాష్ట్ర నాయకులు హర్షించకపోవడంతో బ్రిటిషువారి వైపు మొగ్గి, తన ప్రభువుకు వ్యతిరేకంగా బొంబాయి ప్రభుత్వ సహాయాన్ని కోరాడు. అంతకు ముందు బ్రిటిషువారు టిప్పుతో యుద్ధం కొనసాగించే సమయంలో అట్టి సహాయాన్ని కోరివుంటే టిప్పుకి ఇబ్బందిగా పరిణమించి వుండేది. టిప్పు మంగళూరు సంధి కుదుర్చుకొన్న తదనంతరమైనందుకు నర్గుంద నాయకుని కోరికను బ్రిటిషువారు పట్టించుకోలేదు. దానితో దేశాయి పుంగనూరు, వదనపల్లి మొదలైన ప్రాంతాలలోని పాళెగాళ్ళను టిప్పు పై తిరుగుబాటు చేయమని పురిగొల్పాడు. దాదాపు రెండు సంవత్సరాలు కట్టట వలసిన కప్పం దాటవేశాడు.

అట్టి శత్రుచర్యల వలన దేశాయిని అణచతలచి టిప్పు కప్పం పెంచడంతో బాటు అంతవరకు కట్టవలసిన బకాయిల మొత్తాన్ని వంటనే చెల్లించమని నిర్బంధించాడు. దేసాయి బకాయిని కట్టడానికి నిరాకరించి పూనా సంస్థానపు సహాయాన్ని వెంటనే అర్థించాడు. తనపై టిప్పు అకారణంగా కప్పం అధికం చేసాడని ఫిర్యాదు చేశాడు. నానాసాహెబ్ దేశాయికి సహయాన్ని నిరాకరింపచేయడానికై టిప్పు తన న్యాయవాదులను పూనాకు పంపి, వారిచే జరిగిన విషయాలు తెలియజేశాడు. నిజానిజాలు తెలుసుకోవడానికి గూడ ప్రయత్నించకనే పూనే

లోని అధికారవర్గం టిప్పు చర్య అసమంజసమని ప్రకటించింది. కొన్నిమంద లాలు జాగీర్దారులకు స్వాధీనం చేయబడడం చేత వారు అధిక పన్నును కట్టనవ సరం లేదని, ప్రభుత్వానికి వ్యతిరేకంగా కార్యకలాపాలు కొనసాగించని సంస్థా నాధీశులు గౌరవం పొందాలని నానాసాహెబ్ తెలియజేశాడు. కానీ దేశాయి విద్రో హక చర్యలు కొనసాగించాడనేది టిప్పు వాదన. నానా జోక్యం చేసుకోవడంచేత పరిస్థితులు మారాయి. తన అదికారాన్ని కించపరిచే ఉద్దేశంతో దేశాయి గావిం చిన ప్రకటనలను టిప్పు నిరసించాడు. నర్గుంద విషయం తన రాజ్యపు అంత రంగిక వ్యవహారమని, అందులో ఇతరులు జోక్యం కలిగించుకునేట్లయితే అతని అధికారానికి ముప్పు వాటిల్లుతుందని టిప్పు భావించాడు.

శాంతియుతంగా పరిష్కారం కుదరకపోవడంతో టిప్పు బలప్రయోగానికి దిగాడు. సయ్యద్ గఫార్ ఆధీనంలో ఒక సైన్యాన్ని నర్గుందపైకి పంపాడు. దేశాయి కొద్దికాలం ధైర్యంగా పోరాటం కొనసాగించాడు. మైసూరు సైన్యాలు నర్గుంద దుర్గాన్ని ముట్టడించాయి. నానాసాహెబ్ వెంటనే సమస్యకు పరిష్కారం కుదిర్చ డానికి ఆతురత చూపలేదు. కాని నానా ఇచ్చిన ఉత్తరువులను పాటించక ఒక మరాటా సైన్యం తొందరపాటున టిప్పు సైన్యంపై దాడిచేసి అపజయం పొందిం ది. పరిస్థితిని మెరుగు పరచడానికై పరశురాం బాహు, గణేశ్‌పంత్ బెహరేల ఆధ్వర్యంపో మరాటా సైన్యాలను నానా పంపవలసి వచ్చింది. ముట్టడి ఉపసం హరింపబడినట్టయితే యుద్ధాన్ని ఆపుజేయమని బాహు ఆదేశించబడ్డాడు. శాంతి యుత పరిష్కారానికి తన లాగానే తయారుగా వున్న టిప్పుని నానా సంప్రదిం చాడు. నర్గుందపై తన అధిపత్యాన్ని గుర్తించినట్లయితే రెండేడ్లుగా బకాయిప డిన కప్పాన్ని మహరాష్ట్రులకు చెల్లించడానికి అంగీకరించ వేంటనే తన న్యాయ వాదుల ద్వారా మొత్తాన్ని టిప్పు పూనాకి పంపాడు కూద. ముట్టడి నిలిపి టిప్పు సైన్యాలు నర్దుంద నుంచి వెనుదిరిగాయి. కానీ నానా ఆదేశాలకు వ్యతిరేకంగా బాహు, గణశ్ పంత్‌లు తిరిగి వెళ్ళుతున్న టిప్పు సైన్యాలపై దాడిచేశారు. టిప్పు సైన్యాలు యీదాడిని త్రిప్పికొట్టాయి. మహరాష్ట్ర నాయకుల ప్రవర్తన నానాసాహెబ్‌కు అయిష్టాన్ని కలిగించింది. తన ప్రతిష్ఠాభంగాన్ని తొలగించుకోవ డానికై హోల్కార్ నాయకత్వంలో ఒక పెద్ద సైన్యాన్ని పంపి, తాను ఉత్తరోత్తరా జరగబోయే ముట్టడికి సన్నద్ధుడయ్యాడు.

ఆ విధంగా సైనిక వివాదం వల్ల అనివార్యమయిన పరిస్థితి ఏర్పడింది. ఒక చిన్న జమీందారు మూలంగా యుద్ధం సంభవించినట్లు పైకి కనిపించినా అందుకు

ముఖ్య కారణాలు అనేకం వున్నాయి. దక్షిణంలో తుల ప్రాబల్యం ప్రధాన సమస్యగా పరిణమించిన సమయమది. బ్రిటిషువారికి గూడ తన స్వంత షరతులను నిర్దేశించగల అధికారాన్ని టిప్పుకైవసం చేసుకొన్నాడు. అంతకుముందు మైసూరికి తమ ప్రాంతాలను పోగొట్టుకొన్న స్వదేశా రాజ్యాలకు యిది సుతరామూ గిట్ట లేదు. టిప్పు కూడ ఒక చిన్న జమిందారుపై తన అధికారాన్ని చెలాయించాలనే విషయంలో పట్టుబట్టి దురుసుగానే వ్యవరించాడని చెప్పవచ్చు. భారత దేశంలో అధికార స్థాపనకై కొనసాగు పోటీనుంచి బ్రిటిషువారిని తొలగించాలనే ఉద్దేశం అతనిలో వున్నట్లయితే వారితో విజయవంతంగా ముగిసిన యుద్ధానంతరం కొంత జాగ్రత్తగా మెలగవలసి వుంది. రాజకీయ, న్యాయాన్యాయ విషయాలెలా వున్నా టిప్పు ఒక చిన్న రాజ్యాన్ని ఆక్రమించుకుని భారతదేశంలో బ్రిటిషువారి అధికార విస్తరణ అరికట్టేందుకు సహాపడే ఒక బలమైన ప్రక్క రాజ్యానికి ఆగ్రహం కలిగించాడు.

నిష్కారణంగా జరిగిన బాహు దండయాత్ర టిప్పు సుల్తానుకి నర్గుండను ముట్టడించి ఆక్రమించుకోవడానికి అవకాశాన్ని కల్పించింది. కొద్దికాలంలోనె నర్గుండతో బాటు అనేక ఇతర దుర్గాలు కూడ ఆక్రమించబడ్డాయి. మహరాష్ట్రులు, నిజాం వెంటనే సైనిక కూటమిగా ఏర్పాటై దాదాపు రెండేండ్లు నిరాటంకంగా కొనసాగిన యుద్ధానికి యీ చర్య దారితీసింది. అట్టి యుద్ధం ఏ ఒక్కరికీ మేలు చేకూర్చక పోగా అందరి ఖజానాలను మాత్రం ఖాలీ చేయించింది. మిత్ర కూటమి కొన్ని సమస్యలను ఎదుర్కొన వలసి వచ్చింది. నిజాం నానాసాహెబ్ వద్దనుంచి యుద్ధ ఖర్చులకింద ఇరువది లక్షల రూపాయలతో బాటు తన సహాయానికి ప్రతిఫలంగా బీజాపూర్, అహమ్మద్ నగర్‌లను యివ్వమని కోరాడు. ఈ విషయాలని పరిష్కరించుకోవడానికై 1785 నవంబరులో నానాసాహెబ్ నిజాం ఇద్దరూ యాద్గిరివద్ద సమావేశమయ్యారు. నిజాం కోరికలు చాల పెద్దవే అయినా మిక్కిలి ప్రధాన విషయమైన టిప్పుతో యుద్ధము, అతని రాజ్యాన్ని తమలో పంచుకొను విధానంపై ఒప్పందం కుదిరింది. యాద్గిరినుంచి వెనుతిరిగిన వెంటనే నానా ఇతర మహరాష్ట్ర నాయకుల సహాయాన్ని కూడగట్టి ప్రారంభించాడు. ముదోజి భోస్లే 10,000 సేనలను తుక్కోచి హోల్కార్ 20,000 సేనలను వాగ్దానం చేశారు. పరశురాం బాహు గూడ ముందుకివచ్చాడు. నానా బ్రిటిషువారివైపు మళ్ళాడు. వీరినుంచి గూడ మొదటి ప్రోత్సాహకరమైన జవాబు వచ్చింది. మంగళూరు సంధి షరతులకు విరుద్ధంగా మెక్ పియర్సన్ మిత్ర రాజ్య కూటమిలోని ఒక్కో

క్కరికీ సైనిక సహాయం అందజేయ నిర్ణయించాడు.

టిప్పు అన్ని వైపుల నుంచి ఏకాకిగా అయిపోయాడు. మొదట్నినుంచి మిక్కిలి సన్నిహితంగా వున్న ఫ్రంచివారుగూడ కడపటికి సహాయాన్ని నిరాకరించి తట స్థంగా వుండిపోవడానికి నిర్ణయించుకొన్నారు. స్థానిక రాజ్యాలన్నిటినీ బ్రిటిషువా రికి వ్యతిరేకంగా తమ ఆధ్వర్యంలో సంఘటిత పరచడమే ఫ్రెంచివారి ప్రధాన ఆశయం. టిప్పుని సర్వనాశనం చేయడానికి మహారాష్ట్రులు, నిజాం కలసి కుట్ర పన్నారని, ఇది బ్రిటిషువారికి సంతృప్తికర పథకమని బుస్సీ వూహించాడు. అంతే కాక ఫ్రెంచివారి సిద్ధాంతాలలో అనేక మార్పులు సంభవించి, టిప్పుని మునుప టివలె పాతస్నేహితుడిగా అనేక మార్పులకు మహారాష్ట్రులు ఉపయోగపడతా రని వారు భావించారు. తత్ఫలితంగా టిప్పు ఈ యుద్ధంలో తన స్వంత బలం మీద మాత్రమే ఆధారపడవలసివచ్చింది. శత్రుకూటమిని ఛేదించడానికి చేసిన ప్రత్నాలన్నీ విఫలమయ్యాయి. అతను మొదట్లో నిజాంను తరువాత మహారాష్ట్ర నాయకులను ఆశ్రయించాడు. ఆఖరికి నానాసాహెబ్ వద్దకు గూడ తన న్యాయ వాదులు మహమ్మద్‌ఘ్యూస్, నూర్ మహమ్మద్ ఖాన్‌లను కట్టవలసిన బకాయి పైకంతోబాటు పంపాడు. హోల్కాల్ యుద్ధంలో చేరక తటస్థవిధానాన్ని అనుస రించినట్లయితే ఐదులక్షల రూపాయలు చెల్లిస్తానన్నాడు. కాని యీ ప్రయత్నా లన్నీ ఏ ఫలితాన్ని యివ్వలేదు.

1786 సం॥ మే నెలలో మరాఠా సైన్యాలు బాదామిని ముట్టడించడంతో యుద్ధం ప్రారంభమైంది. 21 రోజులు కొనసాగిన ముట్టడిలో బాదామి ఆక్రమించబడిం ది. బాదామి ఆక్రమణ తర్వాత నానాసాహెబ్ తన సైన్యాలను హరిపంత్‌కు అప్పజెప్పి పూనాకు తిరిగి వెళ్ళాడు. 1786 జూన్ లో హరిపంత్ గజేంద్ర గర్‌పై దండెత్తి జూన్ 19 వ తేదీన ఆక్కమించుకొన్నాడు. యుద్ధసమయంలో టిప్పు కూర్గు ప్రాంతంలో వున్నాడు. అక్కడినుంచి వెంటనే ఆదోని చేరుకొని, నిజాం పంపిన అనేక సైన్యాల ప్రతిఘటనను లెక్కచేయక ఆ పట్టణాన్ని ఆక్ర మించుకొన్నాడు. అక్కడి కోట గూడ విజయవంతంగా ఆక్రమించబడింది. 1786 లో టిప్పు సులభంగా తుంగభద్రను దాటాడు. ఇది హరిపంత్‌కు ఆశ్చర్యాన్ని గలిగించింది. అక్టోబరు 1వ తేదీన మహారాష్ట్రులు విడిదిపై రాత్రిపూట దాడి కొనసాగించాడు కాని అప్రమత్తులైన మహారాష్ట్ర వేగులు దానిని త్రిప్పికొట్టగలి గారు. నవంబరు 30 వ తేదీన అట్టి రాత్రి దాడిలో టిప్పు మహారాష్ట్రులపై దెబ్బ తీశాడు. 1787 జనవరి 3 వతేదీన బహదూర్ బండను ముట్టడించి అభేద్యమని

పేరుపొందిన ఆ దుర్గాన్ని ఆక్రమించాడు. ఫిబ్రవరి 10 వ తారీఖున టిప్పుకి మహారాష్ట్రులకీ కాల్పుల విరమణ జరగనంతవరకు శత్రుసైన్యాలకి టిప్పు అపార నష్టాన్ని కలుగజేశాడు.

యుద్ధంలో విజయ పరంపరలు సాధిస్తూ వచ్చినా టిప్పుకు పోరు చాలిం చాలనే ఉద్దేశం గలిగింది. 1786 సెప్టెంబరు నుంచి హరిపంత్‌తో యీ విష యమై మంతనాలు గూడ ప్రారంభించాడు. టిప్పు శాంతిని కాంక్షించడానికి మరి యొక కారణం, బ్రిటిషువారు తటస్థంగా అట్టే కాలం కొనసాగరని అతని అనుమా నం. కమాండర్ మాలెట్ అప్పటికే గవర్నర్ జనరల్‌ను తన నిర్ణయాన్ని మార్చు కొనమని ఒత్తిడి తెచ్చాడు. బ్రిటిషువారు ఆ సమయంలో యుద్ధానికి దిగక పోయి నందున, ఇతర మిత్రరాజ్యాలు యుద్ధంలో సరిగా పనిచేయక పోయినందునా, నానాసాహెబ్ గూడ శాంతికి సుముఖత చూపాడు. మ్యాక్‌ఫర్సన్ ఒక్కొక్క స్థానిక రాజ్యానికి ఒక ప్రత్యేక బ్రిటిషు సైన్యాన్ని సహాయంగా పంపడానికి ఒప్పుకొ న్నా, లార్డ్ కారన్‌వాలీసు అందుకు అంగీకరించలేదు. టిప్పు తన సైనిక నాయ కులైన బద్రూజ్ జమాన్‌ఖాన్, అలీరెజాఖాన్‌లను పూనాకు పంపగా, నానా అవకా శాన్ని జారవిడువక శాంతి సంప్రదింపులకై హరిపంత్‌ను అక్కడికి పంపాడు. ఇరుపక్షాలు పట్టుగా బేరాలు కొనసాగించాయి. ఆక్రమిత ప్రాంతాలను అప్పచె ప్పమని, తుంగభద్రకు ఉత్తర ప్రాంతంపై తన సర్వాధి కారాన్ని గుర్తించమని టిప్పుకోరాడు. ప్రతిగా తాను కట్టవలసిన 48 లక్షల రూపాయల బకాయిని రెండు వంతులుగా చెల్లిస్తానన్నాడు. వివాదగ్రస్తమైన ప్రాంతాన్నంతా అప్పచెప్పమని హరిపంత్ కోరాడు. టిప్పు తన ఖైదులో మ్రగ్గుతున్న కోలాపంత్‌ని వదిలిపెట్టి , ఆదోని, సర్గుంద, కిట్టూర్‌లను ఆయా అధిపతులకు అప్పజెప్పి, సావనూర్‌ను మాత్రం తనకోసం వుంచుకోవడానికి అంగీకరించాడు. బాదామిని పీష్వాకిచ్చి, గజేంద్రగర్‌ను మాత్రం తన అధీనంలో వుంచుకోవడానికి ఉత్తరోత్తరా అన్ని బకా యిలను సక్రమంగా కట్టడానికి అంగీకరించాడు. కృష్ణా నదికి దక్షిణంగా గల భూభాగాన్నంతటికీ తాను సర్వాధికారి అనే విషయాన్ని 'పాదుషా' పట్టాన్ని అత నికి ప్రసాధించాలి. హరిపంత్ అన్ని షరతులకు అంగీకరించాడు. కాని కడపటిది మాత్రం కాదన్నాడు. అందుచే హోల్కార్ జోక్యం కలిగించుకొని, మధ్యే మార్గంగా 'నవాబ్' అనే సంబోధనను గుర్తించడానికి అంగీకరించడమైంది. 1787 ఏప్రిల్ లో గజేంద్రగర్ వద్ద సంధి పత్రంపై సంతకాలు చేయబడ్డాయి.

సంధి టిప్పుకి ఏమాత్రం అనుకూలమైనది కాదు. సైనికంగా తన అధిక్య

తను నిరూపించుకోగలిగినా, యుద్ధం మూలంగా అటు ధనాన్నిగాని, క్రొత్త భూభాగాన్నిగాని అతను పొందలేదు. తన శత్రువులకు కలుగజేసిన సౌకర్యాల మూలంగా వారిని తన పక్షానికి త్రిప్పుకోవచ్చని అతను వేసుకొన్న అంచనా తప్పు అని ఋజువైంది. తక్కిన వారందరూ బ్రిటిషువారి పక్షాన్ని చేరి తనని ఓడించడానికి మరొక్కసారి ప్రయత్నించారు. సంధిషరతులు లాభదాయకంగా వున్నా నానాసాహెబ్‌ను సంతృప్తిపరచలేదు. తన ప్రక్క రాజ్యాలన్నిటినీ తృప్తిపరచి బ్రిటిషువారితో చేతులు కలపకుండా చేయడం టిప్పు ముఖ్య ఉద్దేశం. వారందరి సన్నిహిత స్నేహాన్నీ కూడదీసి, పరదేశీయుల నెదిరించ ప్రయత్నించాడు. కాని ఈ రెండు ముఖ్య అభిలాషలలో విఫలుడయ్యాడనేది తర్వాత జరిగిన సంఘటనల మూలంగా విదితమైంది.

స్వదేశీ రాజ్యాలు పదే పదే కీచులాడుకోవడం విదేశీ శత్రువులకు బలము కలిగించడానికి అవకాశమనే సత్యాన్ని యీ యుద్ధం ఋజువుచేసింది. తమ ఆంతరంగిక కలహాల మూలంగా ఒకప్పుడు మైసూరుకు సింహస్వప్నంగా వున్న మహరాష్ట్రుల బలాధిక్యత క్షీణించిన విషయము విదితమే. ఈసారి వారు నిజాం పక్షాన్ని చేరి పోరాడారు. కాని వారనుకున్నట్లు విశాల భూభాగాన్ని ఆక్రమించుకోవడానికి గాని లేదా టిప్పుని ఓడించి అతని వద్దనుంచి అమిత ధనాన్ని వసూలు చేసుకోవడానికి వీలుపడలేదు. యుద్ధం మూలంగా నిజాం పరిస్థితిలో గూడ అట్టే పెద్ద మార్పురాలేదు. యుద్ధం కొనసాగే సమయంలో కూడ అతను పెద్ద ప్రభావాన్ని చూపలేదు. ఆ ప్రాంతపు రాజకీయ వాతావరణాన్ని క్షుణ్ణంగా పరిశీలించడానికి స్వదేశీరాజ్యాల మధ్య కుతంత్రాలు కొనసాగింపజేసి, విజయము సాధించగలదనే రాజ్యపు పక్షాన్ని ఆశ్రయించడం వంటి దౌత్య కలాపాలలో అతని శక్తిని ప్రదర్శించాడు. ఆ విద్యమైన ఆటను అతను రెండవ, మూడవ మైసూరు యుద్ధ సమయాలలో గూడ కొనసాగించి, టిప్పుని నష్టపరుస్తూ తాను మాత్రం అమిత లాభాన్ని పొందాడు. తాని స్వతహాగా గల బలహీనతచే చివరికి రాజకీయ నాయకత్వానికి పూర్తిగా ఎదగలేక ఏదో ఒక రాజ్యపు అడుగులకు మడుగులొత్తుతూ తృప్తిపడ్డాడు. కొద్ది కాలానికి బ్రిటిషువారికి సామంతుడిగా తయారయి వారికి దాసోహమని, అటు దౌత్య విధానాలలోను ఇటు సైనిక శక్తిలోను వారు తన కన్న అనేక రెట్లు మిన్నయని నిరూపింపజేశాడు. నిజాం యొక్క అట్టి హ్రస్వ దృష్టి పథకాలను టిప్పు ఎంతో తెలివిగా ముందుగానే పసిగట్టినందుచేత తన చుట్టుపట్ల రాజ్యాల స్నేహాన్ని కోరాడు. యుద్ధంలో తన ప్రత్యర్థులకన్న

పైచేయిగా వున్నా సంకోచించక, మహారాష్ట్రులకు కొన్ని దుర్గాలను ఇచ్చుకొని బ్రిటిషు వారికి వ్యతిరేకంగా ఒక సంఘటిత ప్రతిపక్షాన్ని ఏర్పాటుజేయ ప్రయత్నించాడు.

# 4

## విదేశీ, స్వదేశీ రాజ్యాలతో సంబంధాలు

వాణిజ్య విధానాలు దౌత్యరీతుల మూలంగా బాహ్య ప్రపంచంతో సంబంధాలు స్థాపించుకోవడానికి టిప్పు మిక్కిలి ఆసక్తి చూపాడు. దేశ రాజకీయాలలో పాశ్చాత్యుల రాక కలిగించిన మార్పు మూలంగా సనాతన దౌత్య పద్ధతులలో ఏర్పడిన క్రొత్త విధానాలు టిప్పుకి తెలియక పోలేదు. స్వదేశీ రాజ్యాలకు స్వతహాగా గల బలహీనత, వారిలో లోపించిన ఐక్యత టిప్పుని సహాయానికై విదేశీ శక్తుల వైపు త్రిప్పింది. దీనికై అతను ఫ్రాన్సు, టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్ మొదలైన దేశాలను సంప్రదించాడు. అతని రాజకీయ లక్ష్యము సిద్ధించక పోయినట్టయితే కనీసం తన దేశపు వర్తక వాణిజ్యాలను ప్రోత్సహించామన్న సంతృప్తి కలుగుతుందని వూహించాడు. విదేశాలలో అమిత గిరాకీ గల మిరియాలు, ఏలకులు, గంధపు చెక్క, దంతము, పట్టు, కొబ్బరి, పొగాకు, ఏనుగులు మొదలైన అనేక విలువైన ఎగుమతులకు ఆ రోజులలో మైసూరు ఎంతో ప్రసిద్ధి చెందింది. అందుచేత అతడు టర్కీ, చైనా, మస్కట్, పెగు, ఆర్మీనియా, జిద్దా, ఆర్మజ్ మరియు కచ్ వంటి అనేక దేశాలతో వ్యాపార సంబంధాలను అబివృద్ధి పరచాడు. విదేశాలకు రాయబారులని పంపడంలో టిప్పు వాణిజ్యాని కన్న రాజకీయ ప్రయోజనాలకు ప్రాముఖ్యత నిచ్చాడని చెప్పవచ్చు.

18 వ శతాబ్దంలో టర్కీ ఒక వైపు బలహీనంగావున్నా చులకనగా తీసి వేయడానికి వీలులేని దేశంగా వుంది. రష్యా విస్తరణను ఎదిరించి ఐరోపాలో అనేక ప్రాంతాలను తన ఆదీనంలో వుంచుకొన్నది. బ్రిటిషువారి విస్తరణను టిప్పు సర్వ ఇస్లాం ప్రపంచానికే ముప్పుగా భావించి, వారిని "ఇస్లాం మత విరోధులు" గా అబివర్ణించాడు. టర్కీ సుల్తాను ఐరోపియనులకు వ్యతిరేకంగా ఒక మతయుద్ధాన్ని లేవదీసివుంటే టిప్పు హర్షించేవాడు. అందుచేత 1784 లో బ్రిటిష్‌వారితో యుద్ధము ముగిసిన వెంటనే ఉస్మాన్‌ఖాన్ నాయకత్వంలో టిప్పు కాన్‌స్టాంటినోపిల్‌కు ఒక

ప్రతినిధి వర్గాన్ని పింపి, టర్కీ సుల్తాను తన వద్దనుంచి ఒక ప్రత్యేక దూతను ఆహ్వానించడానికి సుముఖంగా వున్నాడా లేదా అని కనుగొనతలచాడు. పరిస్థితులు ప్రోత్సాహకరంగా వున్నందువల్ల టిప్పు నలుగురు సభ్యులతో కూడిన తన ప్రధాన దౌత్య వర్గాన్ని 1785 లో పంపాడు. కాన్‌స్టాంటినోపిల్‌కు ఈ దౌత్యవర్గాన్ని పంపడంలో గల టిప్పు ఉద్దేశాలపై కొంత భేదాభిప్రాయముంది. అటమన్ సామ్రాజ్యంలో వర్తకకేంద్రాల స్థాపనకు, టర్కీ రేవు పట్టణాలలో వ్యాపార సంబంధాలు పొందడానికై టిప్పు ప్రతినిధి అసంభవమైంది. ఎందుకంటే బలమైన నౌకాదళము గాని, పెద్ద వ్యాపార నౌకగాని లేని పక్షములో అట్టి వర్తకస్థావరాలు నిరుపయోగము. బ్రిటిషువారిని శక్తివంతంగా ఎదిరించడానికి రాజకీయ, సైనిక ఒప్పందాన్ని కుదుర్చుకోవాలనేదే టిప్పు తన దౌత్యవర్గాన్ని టర్కీ సుల్తాను వద్దకు పంపడంలో గల ప్రధాన ఉద్దేశం. మైసూరు అధినేతలు ఒక విదేశాన్నుంచి సహాయం పొందడం కొత్తేమీకాదు. హైదర్ పర్షియాలోని షిరాజ్ నుంచి 1775 లో 1,000 సైనికులను సహాయంగా పొంది వుండడం తెలిసిందే. ఇది టిప్పుని మరీ ఉత్సాహపరచి నందున టర్కీ సహాయాన్ని కోరాడు. సుల్తాను అబ్దుల్ హమీదుకు వ్రాసిన జాబులో టిప్పు భారతదేశంలో బ్రిటిషువారు చేసిన దురాగతాలను, వారు స్థాపించిన రాజకీయ అధికృతను. ప్రజల హక్కులను అధికారాలు హరించుటకు వారు అనుసరించిన విధానాలను వివరించాడు. టర్కీతో కుదుర్చుకొనబోయే ఒప్పందంలోని నాలుగవ అంశం మైసూరు, టర్కీల మధ్య సైనిక సహకారమునకు సంబంధించింది. టర్కీ నుంచి వచ్చే సైన్యాలను రవాణఖర్చులతో భరించడానికి అవసరమైనప్పుడు సైన్యాలను తిరిగి పంపడానికి టిప్పు అంగీకరించాడు. అయిదు అంశాలుగల ఒప్పందములో ఒక అంశము బాస్రాలోని వ్యాపార స్థావరాలు స్థాపించే విషయానికి సంబంధించింది. మరి ఒక అంశం ప్రకారం టర్కీ సాంకేతిక నిపుణులను, పని వారిని అధికసంఖ్యలో పంపి తుపాకులు ఫరంగులు తయారు చేయటలో టిప్పుకి సహాయ పడాలి. వ్యాపరము పరిశ్రమలు మొదలైనవి నిర్లక్ష్యము అవటంతో దేశము క్షీణిస్తుందని టిప్పు భావించాడు. దౌత్యవర్గాన్ని పంపడంలో టిప్పు మరో ఉద్దేశం, ఇస్లాం మత ప్రాతిపదికపై సార్వభౌముడైన టర్కీ సుల్తానుచేతాను మైసూరు సింహాసనానికి చట్ట బద్ధమైన వారసుడిగా గుర్తింపుపొందడం. అంతకుముందు మైసూరులో టిప్పు సింహాసనానికి రావడం న్యాయబద్ధంగా గుర్తింపు పొందలేదు. నిజాం, మహరాష్ట్రులు, కర్ణాటక నవాబు-అందరూ మొగలాయి చక్రవర్తిచే గుర్తింపు పొందిన వారు. కాని

హైదర్ గాని, టిప్పుగాని అట్టి గుర్తింపు పొందియుండలేదు. మైసూరులో హిందూ రాజు అధికారంలో అప్పటికి కొనసాగినట్లే లెక్క, హైదర్‌గాని, టిప్పుగాని అకార ణంగా సర్వాధికారములుగల సార్వభౌములుగా గుర్తింపబడలేదు. టిప్పు మొగలు చక్రవర్తి నుంచి గుర్తింపు కోరలేదు. ఒకవేళ అట్లాకోరినా, దక్షిణంలో మొగలుల వైస్రాయి అయిన నిజాంకి అణగి వుండవలసి వచ్చేది. టిప్పు స్వతంత్రాన్ని ప్రక టించుకొని, నామమాత్రంగా గల, రాజుని తొలగించి, "దళవాయి" అనే నాసి రకం బిరుదును త్యజించాడు. గజేంద్రగర్ ఒప్పందంలో "పాదుషా" బిరుదు గుర్తింపుకై కృషిచేశాడు. స్వతంత్ర సుల్తానుగా అక్కడ గుర్తింపు పొందివుంటే స్వదేశీ రాజుల మధ్య మరింత గౌరవ మర్యాదలు పొందగలడు. టర్కీ అధినేతయైన సుల్తాన్ సరీం తనని స్వతంత్ర చక్రవర్తిగా సంబోధించడంతో తన అభీష్టం కొద్దిగా నెరవేరినట్లయింది. చరిత్ర ప్రసిద్ధిగాంచిన గజనీమహమ్మదు, ఇల్టిమిట్‌మిష్, మహమ్మద్‌బీన్ తుగ్లక్, ఫిరోజ్‌షా మొదలైన వారందరూ ఖలీఫా చే గుర్తింపుపొందారు. హైదరాబాదు నిజాం, కర్ణాటక నవాబులకు టిప్పు తాను నిరుపయోగమైన మొగలాయి చక్రవర్తినుంచి గాక సర్వాధికారియైన సార్వభౌమునిచే గుర్తింపు పొందినవాడని గుర్తిచేయదలిచాడు.

కాన్‌స్టాంటినోపిల్‌లో దౌత్యాధికారులు మిక్కిలి గౌరవ మర్యాదలు పొందారు. సుల్తాను వారిని సాదరంగా ఆహ్వానించాడు. కాని సంధిలోని ప్రదాన అంశాలను మాత్రం దాటవేశాడు. టిప్పు అడిగిన సహాయానికి బదులుగా టర్కీ సుల్తాను అబ్దుల్ హమీద్ రష్యా ఏవిధంగా దురాక్రమణకు సిద్ధమవుతున్నదీ వెల్లడించి, అట్టి అక్రమణను ప్రతిఘటించడానికి తాను ఆ సమయంలో నిమగ్నమై వున్నట్లు వివరించాడు. బ్రిటిషువారు యీ సమయాన్ని సద్వినియోగ పరచుకొని టర్కీ అలీన విధానాన్ని సమర్థించారు. బ్రిటిషువారికి వ్యతిరేకంగా సంధి కుదుర్చుకొని వారికి ఆగ్రహం కలిగించడానికి టర్కీ సిద్ధంగాలేదు. బ్రిటిషు రాయబారి సర్ రాబర్ట్ ఎస్‌ప్లే పరిస్థితులను పరిశీలిస్తూ అంగ్లేయుల అవసరాలకు నష్టం వాటిల్లక జాగ్రత్తపడ్డాడు. కాని టిప్పు ఉద్దేశాలలో ఒకడైన గుర్తింపు పొందడం మాత్రం సాధించుకొన్నాడు. నాణెములను ముద్రించడానికి "కుత్బా" తన పేర చదవడానికి అనుమతితోబాటు టిప్పు సర్వస్వతంత్ర చక్రవర్తిగా పరిగణింపబడ్డాడు. ఈ అంశములు గల 'ఫర్మానా' రాయబారులు సుల్తాను తెచ్చారు. దాదాపు నాలుగేండ్లు తర్వాత రాయబారులు 1789 డిసెంబరులో స్వదేశానికి తిరిగి వచ్చారు. అతని అనుయాయులైన బాలముకుంద రాయ్. మూల్‌చంద్, సజ్జన్‌రావులు అక్కడి

పరిస్థితులను ఎప్పటికప్పుడు తెలియజేస్తూవచ్చారు. 1783 లో టిప్పు ఆర్కాటు నవాబు 'సనద్' కోసరం షా ఆలంను కోరాడు. ఫ్రెంచ్‌వారు గూడ టిప్పు అభ్యర్థనను సమర్థించారు. అప్పటి ఆర్కాటు నవాబైన మహమ్మదాలి వాలజ, మద్రాసులోని బ్రిటిషువారి అదకత్తెరకు లోనై తననితాను రక్షించుకోవడంలో గూడ విఫలమయ్యాడన్న పేరు తెచ్చుకొన్నాడు. ఆర్కాటు కట్టవలసిన కప్పాన్ని తాను చెల్లిస్తానని టిప్పు తెలియజేశాడు. మొగలాయి చక్రవర్తి సలహాదారులందరినీ గూడ అతను తన పక్షానికి లాగగలిగాడు. కాని బ్రిటిషువారి జోక్యం చేత టిప్పు తాను అనుకొన్నది సాధించలేక పోయాడు. మేజర్ బ్రౌన్ అక్కడి ప్రధాన మంత్రియైన ముజాద్ ఉద్దౌలా మూలంగా ఫ్రెంచివారి పలుకుబడిని విజయవంతంగా అరికట్టగలిగాడు.

టర్కీ సుల్తాను నుంచి గాని ఢిల్లీ దర్బారు నుంచి గాని సహాయం పొందలేక పోవడంతో టిప్పు మళ్ళీ ఫ్రెంచ్‌వారి వైపు మళ్ళాడు. భారతదేశంలో అతను బ్రిటిషువారితో మహరాష్ట్రులతో చేసిన యుద్ధాలలో ఫ్రెంచివారు అతనికి ఆశాంభంగం కలిగించారు. కానీ పారిస్‌లోని అధికారులని ఆశ్రయించిన మేలని అతను భావించాడు. టిప్పుకి ఫ్రెంచివారికీ మధ్య అనేక వ్యత్యాసాలున్నా ఒక్క విషయంలో మాత్రం గొప్ప సామ్యంవుంది. క్రేసే, అగిన్ కోర్ట్ యుద్ధాల తర్వాత ఆంగ్లేయులు, ఫ్రెంచివారు బద్ధవిరోధులైన కారణంగా అట్టి విరోధాన్ని టిప్పు వినియోగించదలిచాడు. టిప్పు ఆస్థానంలోని ఫ్రెంచి వీరులు ఆంగ్లేయులని భారతదేశం నుంచి తొలగించడానికి ఫ్రాన్సు తప్పక సహాయం చేస్తుందనే ఆశను టిప్పులో కల్పిస్తూ వచ్చారు. బ్రిటిషువారితో యుద్ధానికి దిగిన ఫ్రెంచివారి నుంచి ఎటువంటి సహాయం తనకు లభిస్తుందో తెలుసుకోవడానికై ఫ్రెంచి చక్రవర్తియైన పదహారవ లూయీ వద్దకు ఒక రాయబారం పంపాడు. సైనిక సహాయం కోరడానికి బ్రిటిషువారికి వ్యతిరేకంగా సంధికుదుర్చుకోవడం గూడ టిప్పు ఉద్దేశాంలో ప్రధానమైంది. తన ఆధీనంలో పని చేయడానికి పదివేల ఫ్రెంచి సైన్యాన్ని పంపవలసిందని కోరాడు. కుదుర్చుకోదలచిన సంధిలోని మొదటి అంశము ప్రకారం బ్రిటిషువారిపై యుద్ధము ప్రకటించబడి, మద్రాసు, బొంబాయి, బెగాలు పూర్తిగా ఆక్రమించేంతవరకు యుద్ధం నిరాటంకంగా కొనసాగాలి. మొదట దక్షిణ ప్రాంతం, తర్వాత ఉత్తర ప్రాంత ఆక్రమించబడాలి. ఈ షరతులని మిక్కిలి రహస్యంగా వుంచమని టిప్పు తన రాయబారులను ఆదేశించాడు. ఈ దౌత్య బృందం పారిస్‌లో తమ పనిముగిసిన తరువాత ఇంగ్లండుకు ఎట్టి అనుమానాలు కలగకుండాడానికై

లండన్‌గూడా వెళ్ళునట్లు ఆదేసించబడింది. టిప్పు ఆస్థానంలోని ఫ్రెంచి ప్రతినిధియైన పెర్రీ మోనెరన్ టిప్పు దౌత్య బృందాన్ని అనుసరించి వెళ్ళాడు. నలుగురు రాయబారులు, నలభై సభ్యులుగల ఆ బృందం 1787 జూలై 22న పాండిచ్చేరి నుంచి బయలుదేరి ఫ్రాన్సులోని టౌలాన్ను 1788 జూన్ 9 న చేరుకుంది. రాయబార వర్గాన్ని ఆహ్వానించడానికై ఫ్రెంచి రాజు తన స్వంత తివాసీలను గూడ పంపాడు. కాని ప్రతినిధి వర్గం ముఖ్యంగా తలపెట్టినది మాత్రం జరగలేదు. 1788 ఆగస్టు 3 వ తేదీన ఫ్రెంచి చక్రవర్తి లూయీ వారిని సాదరంగా ఆహ్వానించి టిప్పుపట్ల తనకుగల అపార ఆప్యాయతను తెలియజేశాడు. కాని ఫ్రాన్సు అప్పట్లో క్లిష్టపరిస్థితిలో వున్నకారణంగా ప్రధాన సమస్యయైన సైనికసంధి విషయాన్ని లూయీ దాటవేశాడు. టిప్పుతో సన్నిహితంగా వున్న ఫ్రాన్సు సహాయాన్ని సమర్థిస్తూ వచ్చిన నౌకాశాక మంత్రి మార్షల్ డికాస్ట్రీస్ స్థానే మిక్కిలి పిరికివాడై ఎందుకూ కొరగాని కాంటె డి లాలుసర్నే నియమింపబడ్డాడు. భారతదేశానికి మరిన్ని సైన్యాలు పంపడానికి బదులు ఉన్న సైన్యాలను గూడ వెనుకకు రప్పించాడు క్రొత్త మంత్రి. ఫ్రాన్సుదేశం ఆ సమయంలో ఆర్థికంగా, సాంఘికంగా అలజడులకు గురిఅయిన కారణంగా పెద్ద ఎత్తున సైన్యాలను పంపడానికి వీలుగూడ లేకపోయింది. అందుచేత సైనిక ఒప్పందాన్ని గురించి తీవ్రంగా ఆలోచించే ఉద్దేశం గూడ ఫ్రాన్సుకి అప్పట్లో లేదు. వ్యక్తిగతంగా టిప్పు పట్ల అమిత ఆదరం చూపినా, అసలు విషయంమాత్రం జరగలేదు. 1788 మే నెల 10 వ తేదీన పాండిచ్చేరికి తిరిగి వచ్చింది. రాయబారులు తమతోబాటు కొద్దిమంది సాంకేతిక నిపుణులను తోడుకొని వచ్చారు. పదహారవ లూయీ మెక్నియార్ అనే అతన్ని టిప్పుని స్వయంగా కలుసుకొన్నామని తన స్వంత ప్రతినిధి బృందంతో బాటు మర్యాద సూచనగా పంపాడు. ఫ్రాన్సు దేశం అప్పటికే విప్లవ పరిస్థితులకు దగ్గరవుతున్న కారణంగా సైనిక ఒప్పందమనే ప్రశ్న ఉదయించలేదు. ఆ సమయంలో ఫ్రాన్సు తటస్థ విధానాన్ని అనుసరించి, భారతదేశంలో టిప్పు అటు మహారాష్ట్రులతోను ఇటు బ్రిటిషువారితోను చేసిన యుద్ధాలకు దూరంగా వుండిపోయింది. ఫ్రాన్సు సహాయంపై ఆశలు పెంచుకొన్న టిప్పుకి గొప్ప ఆశాభంగమే కలిగింది.

మంగళూరు యుద్ధానంతరం టిప్పుకి బ్రిటిషువారితోగల సంబంధాలు బెడిసిపోయాయి. కంపెనీ వ్యవహారాల్లో అల్లకల్లోలం కలుగుతుందని హేస్టింగ్స్ ఊరుకొన్నాడు. గాని లేకపోతే ఆ సంధిని సరాసరి రద్దుచేయడానికి గూడ ఉద్దేశించా

డు. హేస్టింగ్స్ తర్వాత వచ్చిన మెక్‌ఫర్సన్ గూడ అలాంటి ఉద్దేశమే గలిగి వున్న కారణంగా బ్రిటిషువారు టిప్పుపట్ల దురుసుగానే వ్యవహరించారు. రెండవ మైసూరు యుద్ధసమయంలో ఆక్రమించబడ్డ స్థలాలను ఖాళీ చేయించడంలో అనేక కష్టాలు ఎదురయ్యాయి. మలబారుతీర నాయకుల విషయాలలో బ్రిటిషు వారు జోక్యం కలిగించుకోవడం టిప్పుకు ఆగ్రహం కలిగించింది. కారన్‌వాలీసు భారతదేశానికి రావడంతో టిప్పుకి వ్యతిరేకంగా కూటమిని ఏర్పరచడానికై స్వదేశీరాజుల నాహ్వానించాడు. 1789-87 లో మైసూరు-మరాటా యుద్ధంలో టిప్పు సాధించిన ఘనవిజయం అందరికీ కన్ను కుట్టింది. 1787 సంవత్సర మధ్యకాలంలో టిప్పు కర్ణాటక ప్రాంతాన్ని జయిస్తాడన్న గాలివార్తలను బ్రిటిషువారు పనికట్టుకొని ప్రచారం చేశారు. దీనితో కారన్‌వాలీసు టిప్పుకి వ్యతిరేకంగా ఇతర రాజ్యాలను సైనిక ఒడంబడికకు ఉత్సాహపరచాడు. నానా సాహెబ్ అట్టి ఒడంబడికకి ఒప్పుకొనక పోవచ్చని నానాసాహెబ్ కారన్‌వాలీసుకి తెలిసినా, అంతకు ముందు జరిగిన యుద్ధములో బ్రిటిషువారు తటస్థ విదానాన్ని అనుసరించిన కారణంగా కారన్‌వాలీసుకి తన ప్రతినిధియైన మాలెట్‌ను నానాసాహెబ్‌ను సంప్రదించమని అదేశించాడు. అదే సమయంలో టిప్పు కూడ మహారాష్ట్రులను తన పక్షానికి ఆహ్వానించి బ్రిటిషువారికి వ్యతిరేకంగా ఒక సమాఖ్యను ఏర్పరచడానికి ప్రయత్నించాడు. మైసూరు-మరటా యుద్ధం ముగియడానికి ముందుగా గూడ టిప్పు బ్రిటిషుకంపెనీపై సంఘటిత ముట్టడిని సూచించాడు. కానీ నానాసాహెబ్ తనకు బ్రిటిషు సహాయం నిరాకరింపబడిన కారణంగా ఆగ్రహంతో వున్నందుకు అట్టి పరిస్థితి టిప్పుకి అనువుగా తోచింది. నిజాం గూడ అట్టి సమాఖ్యలో చేరడానికి సిద్ధంగావున్నట్లు తెలియపరుస్తూ తన వకీలుని పూనాకు పంపి నిజాం, మహారాష్ట్రులు, ఫ్రెంచివారితో కలసి ఒక కూడమిని ఏర్పరచేందుకు సంసిద్ధతను తెలియజేయడంతో నానా గూడ అట్టి సంధికి అంగీకరించినట్లు తోచింది. బ్రిటిషు ఆక్రమణలోని ఒకప్పటి శివాజీ ప్రాంతాలైన కర్ణాటకతీర స్థావరాలను మహారాష్ట్రులు పునరాక్రమించుకోవలసిన అవసరమున్నదని నానా సింధియాకు లిఖితపూర్వకంగా తెలియజేశాడు. అటువంటి కార్యక్రమాన్ని చేపట్టడానికి టిప్పు సర్వసన్నద్ధంగా వున్నాడు. నిజానికి విదేశీయులను పారద్రోలడానికి స్వదేశీ రాజ్యాలు సైనిక కూటమిని ఎప్పుడు ఏర్పాటు చేస్తారా అని టిప్పు ఆత్రుతపడ్డాడు. ఆ సమయంలో నిజాం రాయబారి యైన హఫీజ్ ఫరీద్ ఉద్దీన్ ఖాన్‌తో మంతనాలు కొనసాగించాడు. ఈ సంప్రదింపులకు మహారాష్ట్ర దౌత్య ప్రతినిధియైన శివాజీ

రావును గూడ ఆహ్వానించాడు. గుంటూరు సర్కారును పునరాక్రమించుకోవాలని నిజాం ఉద్దేశించాడు. ఖచ్చితమైన ఏ సంధి కుదుర్చుకోవడానికి ముందుగా అన్ని పక్షాలు మూడేండ్లు శాంతిని పరిరక్షించడానికి అంగీకరించారు. ఈ శాంతి ఒప్పందాన్ని మహారాష్ట్రులతో ఒక శాశ్వత ఒడంబడికగా మార్చాలని టిప్పు వాంఛించాడు గాని అతని ప్రయత్నాలు ఫలించలేదు.

1789 సెప్టెంబరులో బ్రిటిషువారు గుంటూరును బలవంతంగా ఆక్రమించుకొని నిజాంకు ఆగ్రహాన్ని కలిగించారు. భారతదేశంలో కొందరు బ్రిటిషు అధికార్లు గూడ ఈ చర్యను సమర్థించలేక పోయారు. కల్నల్ రీడ్ యీ విధంగా వ్రాసాడు. "మనతో సన్నిహితంగా వుండేవారిని బలహీన పరిచే ఉద్దేశం మనకున్నదనే అభిప్రాయం స్వదేశీ రాజులందరికీ ఏర్పడింది. మనపక్షాన చేరిన వారికి గూడ మనము వారికి నిజంగా సహాయం అందేచేయగలమా లేదా అన్న అనుమానం కలుగతున్నదని నా నమ్మకం."[1] అన్ని విధాల ఏకాకిగా చేయబడ్డ నిజాం, టిప్పు యెడల మిక్కిలి సన్నిహితుడైనట్లు అగుపడింది. 1787 ఆగస్టు నెలలో నిజాం తన బావమరిదియైన ఇంతియాజ్ ఉద్దౌలా. రాజప్రాసాద రక్షకభటుల నాయకుడైన షాంసుల్ ఉమ్రాలను ఒడంబడికకు టిప్పు ఉద్దేశాలను తెలుసుకొమ్మని పంపాడు. టిప్పు దానిక సుముఖంగా వున్న కారణంగా హాఫీజ్ ఫరీద్దీన్ బహదూర్‌ఖాన్ అను ఇద్దరు వకీళ్ళను హైదరాబాదు నుంచి శ్రీరంగపట్టణానికి పంపాడు. నిజాంతో ఒప్పందము కుదర్చుకోవడానికి, అవసరమైన అతనిని స్వయంగా కలవడానికి గూడ టిప్పు సిద్ధమయ్యాడు. దీనితోబాటు టిప్పు నిజాంతో పెళ్ళి సంబంధము గూడ ఏర్పాటు చేసుకోదలచాడు. నిజాం కుమార్తెను తన కుమారులతో ఒకనికిచ్చి వివాహము చేయడానికి ఇష్టపడ్డాడు. కాని నిజాం దీన్ని అంగీకరించకపోవడంతో సంప్రదింపులు ఆగిపోయాయి. కానీ 1788 నవంబరులో కారన్‌వాలీసు గుంటూరును ఆక్రమించుకోవాలనే కోరికను తెలియజేయగానే, నిజాం మళ్ళీ టిప్పుతో సంప్రదింపులకు ఆసక్తి చూపాడు. టిప్పు గూడ ఆసక్తి కనబరుస్తూ వివాహ సంబంధాన్ని గూడ ఖరారు చేయదలచాడు. హాఫీజ్ ఫరీదుద్దీన్‌తో టిప్పు మరొకసారి కోయంబత్తూరు వద్ద సంప్రదింపులు జరిపాడు. అప్పుడు మరాటా వకీలు శివాజీరావు గూడ ఆ సంప్రదింపులలో పాల్గొన్నాడు. తన న్యాయవాదులైన కుతుబుద్దీన్ ఖాన్, ఆలీ రేజాఖాన్‌లను టిప్పు హైదరాబాదుకు సంధి షరతులను ఖరారుచేయడానికై పంపాడు.

[1] Mackenzie MSS. Vol. LXIV, P. 58.

ఈ సంప్రదింపు ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. నిజాంని తన వైపు త్రిప్పుకోవడానికి బ్రిటిషువారు అప్పుడే ప్రయత్నాలు ప్రారంభించారు. కారన్‌వాలీసు మైసూరుని జయించి, దానిని నిజాంకు ఇచ్చేఉద్దేశాన్ని వెలిబుచ్చాడు. నిజాం మాత్రం తన లావాదేవీలలో స్వలాభాన్ని మరువలేదు. టిప్పు వద్దకు న్యాయవాదుల్ని పంపిన సమయంలో నిజాం మీర్ ఆలంను కలకత్తాకి పింపి 1768 సంధి ప్రకారం సైనికసహాయం అందజేయవలసిందిగా కారన్‌వాలీసుని కోరాడు. నిజాం ఏకాకిగా వుండేందుకు యిష్టపడలేదు. అటు టిప్పు, ఇటు బ్రిటిషువారిలో తన అవసరాలకు ఎవరు మిక్కిలి ఉపయెగపడుతారో తెలుసుకోవడానికై ఇద్దరినీ సంప్రదించాడు. హైదరాబాదులోని బ్రిటిషు రెసిడెంటు నిజాం ఆస్థానంలోని టిప్పు అభిమానులు పలుకుబడిని తగ్గించగలిగాడు. టిప్పు పుట్టుకతో రాజకుటుంబానికి చెందినవాడు కాదనే ఉద్దేశంతో అతనితో వివాహ సంబంధాల ప్రసక్తి ఉపసంహరించబడింది. వివాహ సంబంధం కుదరనందువల్ల సంప్రదింపులు బెడిసిపోయాయనే పేరువచ్చింది. కాని నిజానికి నిజాం బ్రిటిషువారి సహాయాన్ని అర్థిస్తూ టిప్పుపట్ల ఉదాసీనత కనబరిచాడు. టిప్పు పట్ల అభిమానమున్నవారికన్న తన ఆస్థానంలో బ్రిటిషువారి యెడ అభిమానమున్నవారి పలుకుబడి ఎక్కువ. టిప్పు న్యాయవాదులు బ్రిటిషువారియొక్క కుటిల దౌత్యనీతిని ఎదుర్కొనలేక పోయాడు. నిజాం క్రొత్త ప్రాంతాల ఆక్రమణ ఆశతో బ్రిటిషువారి ఉచ్చులకు ఆకర్షింపబడ్డాడు!

బ్రిటిషువారికి వ్యతిరేకంగా స్వదేశీ రాజ్యాల కూటమిని ఏర్పాటు చేయవలెనని, తన రాజ్యపు వాణిజ్యసంబంధాలను మెరుగుపరచవలెననే రెండు ఉద్ధేశాలను సాధించడానికై టిప్పు అటు స్వదేశీ విదేశీ శక్తులతో స్నేహ సంబంధాలు నిలుపుకోవాలని తలచాడు. కానీ తాను మిక్కిలి శక్తివంతమైన విరోధిని ఎదుర్కొన వలసి వచ్చినందుకు అటు ఫ్రాన్సు టర్కీ దేశాలు అంతరంగికంగా ఆ సమయంలో గొప్ప సమస్యల మెదుర్కొనవలసి వచ్చినందుకు రాజకీయంగా టిప్పు తన కోరికని సాధించలేక పోయాడు. మహరాష్ట్రులు, నిజాం తమ తమ అంతరంగిక విషయాలలో తలమునకలై వుండి మైసూరుపై కత్తి గట్టి వుండటం వల్ల టిప్పుకి సహాయం అందజేయడం కుదరనిది. మిక్కిలి బలహీనులుగా తయారైన మొగలాయీల వలన మైసూరుకి ఎట్టి సహాయమూ లేదు. అయినప్పటికి మైసూరుకి అనేక విదేశాలలో వర్తకసంబంధాలు పెంపొందింపబడిన కారణంగా టిప్పు వాణిజ్యాభివృద్ధి పథకాలు మాత్రం ఫలించాయి. చాల ప్రధానమైన రాజకీయ

ఆశయంలో టిప్పు విఫలం చెందినా, మనదేశం నుంచి ఒక బలమైన విదేశీ అధికారాన్ని బహిష్కరించడానికి చేసిన గాఢ ప్రయత్నం వల్ల అతని ప్రాముఖ్యతని తక్కువగా అంచనావేయడానికి వీలులేదు.

# 5

# మూడవమైసూరు యుద్ధం

టిప్పు చర్యలను బ్రిటిషువారు ఒక కంట కనిపెడుతూ వచ్చారు. మంగళూరు సంధి వారి దృష్టిలో ఒక తాత్కాలిక ఒప్పందం మాత్రమే. మైసూరుతో మరొక యుద్ధం అవసరమని వారికి తోచింది. బ్రిటిషువారేగాక మహరాష్ట్రు, నిజాం గూడ తమ ముందు ఒక స్వదేశీ రాజ్యము శక్తివంతంగా తయారవడం ఇష్టపడ లేదు. అందుచే టిప్పు పై విరుచుకపడడానికి దొరకిన అవకాశాన్ని వినియోగప రచుకొన్నారు. తిరువాన్కూరు సమస్య ఈ సారి యుద్ధకారణమైంది.

తిరువాన్కూరు, రక్షణకై సరిహద్దు ప్రాంతాలలో వెదురుపొదలను నాటిం చిన విషయంపై టిప్పు ఆ రాజ్యం పై తగాదాకుదిగాడు. అట్టి సరిహద్దులు చాలా వరకు కొచ్చిన్ రాజులకు చెందిన భూభాగంలో వున్నాయి. కొచ్చిన్‌రాజు టిప్పుకి సామంతుడు. మైసూరులోని తిరుగుబాటు నాయకులకి అట్టి రక్షణ స్థావరాలు ఆశ్రయమిస్తున్నాయని తలచి టిప్పు వాటిని ధ్వంసంచేయవలసిందిగా కోరాడు. తిరువాన్కూరు రాజు అందుకు అంగీకరించని కారణంగా ఇది వివాదానికి కారణ మైంది. తన సామంతరాజైన కొచ్చిన్‌రాజు ఆధీనంలోని ప్రాంతాలలో వున్న రక్ష ణస్థావరాలను తొలగించడానికి తనకి అధికారముందని టిప్పు పట్టుబట్టాడు. కానీ అలాంటి స్థావరాలు కొచ్చిన్ టిప్పు అధీనములోని ప్రాంతాలలో వున్న రక్షణస్థావ రాలను తొలగించడానికి తనకి అధికారముందని టిప్పు పట్టుబట్టాడు. కానీ అలాంటి స్థావరాలు కొచ్చిన్ టిప్పు అధీనములోకి రాకముందునుంచీ వున్న కారణంగా వాటిని తొలగించే హక్కు టిప్పుకి లేదని తిరువాన్కూరు రాజు వాదన. దీనితో బాటి మలబారులోని తిరుగుబాటు వర్గాలను తిరువాన్కూరు రాజు ప్రోత్సహిం చడం టిప్పుని మరింత రెచ్చగొట్టింది. రక్షణ స్థావరాల విషయంతో బాటు డచ్ వారినుంచి క్రాంగనూరు, ఆయకోట అనే రెండు దుర్గాలను రాజుకొనడం అగ్గిలోఆజ్యంపోసినట్లయింది. ఆయకోట మలబారుతీరంలో వైపీన్ అనే చిన్న

దీవికి ఉత్తరాగ్రంలోని ఒక సైనికి స్థావరము. క్రాంగనూరు ఆయకోటకు రెండు మైళ్ళ దూరంలో వుంది. ఈ రెండు ప్రాంతాలని తిరువాన్కూరురాజు కొనడం మూడవ మైసూరు యుద్ధానికి ప్రధాన కారణంగా పరిణమించింది. ఆ రెండుప్రాంతాలు ఎంతో ముఖ్యమైనవైనందుకు రాజా, టిప్పు, ఇద్దరూ వాటిని ఆక్రమించుకోవడానికి ఆసక్తిచూపించారు. నిజానికి, వాటిని కావాలని డచ్‌వారితో మొదట టిప్పు సంప్రదింపులు ప్రారంభించాడు. కాని లావాదేవీలు ముగియడానికి ముందుగా తిరువాన్కూరురాజు రంగంలో ప్రవేశించాడు. మద్రాసు ప్రభుత్వము గూడ తిరువాన్కూరురాజు ఆ ప్రాంతాలని కొనడాన్ని హర్షించలేదు. ఇది అనేక సమస్యలకి కారణమవుతుందని వారు వూహించారు కాని బ్రిటిషువారిని సంప్రదించక తిరువాన్కూరు రాజు డచ్‌వారితో బేరాలకు దిగాడు. 1789 జూలై 31 వ తేదీన ఈ కొనుగోలు జరిగింది కాని ఆగస్టు 17 వ తేదీన తిరువాన్కూరులో బ్రిటిషు రెసిడెంటయిన పౌనే మద్రాసు గవర్నరయిన హాలోండుకు వ్రాసేంతవరకు బ్రిటిషు వారికి యీ సంగతి తెలియదు. ఆ దుర్గములు మూడులక్షల సూరత్ వెండిరూపాయలకు అమ్మడమైంది. డేవిడ్ రాహాబాయ్, యూఫ్రామ్‌కోహెన్, అంటాశెట్టి అనే యూదు వ్యాపారులు ఋణానికి జామీనులుగా వ్యవహరించడానికి అంగీకరించారు. కోటలను అమ్మటంలో డచ్‌వారు టిప్పుకు బదులు తిరువాన్కూరురాజుని కోరటానికి ముఖ్యకారణం, వారికి టిప్పుతో మంచి సంబంధాలు లేక పోవడమే. అదీకాక ఆ ప్రాంతమందలి పలుకులబడిగల యూదువర్తకులు ఆ ప్రాంతాలను టిప్పు కొన్నట్టయితే తమ వర్తకానికి ముప్పు ఏర్పడుతుందని భావించారు. తిరువాన్కూరు రాజు, డచ్‌వారు, యూదు వర్తకులు అందరూ టిప్పుకి భయపడ్డారు. అనుకొన్న పథకం ప్రకారం ఏదో విధంగా టిప్పుని బ్రిటిషువారిపై యుద్ధానికిదించాలి. కానీ టిప్పు తిరువాన్కూరు పై దురాక్రమణ జరిపితే గాని బ్రిటిషువారు అతనిపై యుద్ధం ప్రకటించరు. అందుచేత డచ్ దుర్గాలని తిరువాన్కూరుకు అమ్మితే టిప్పు వాటిని ఆక్రమించుకోప్రయత్నిస్తాడు. ఆ కారణంచేత డచ్‌వారు టిప్పుకి దుర్గాలను అమ్మేందుకు నిరాకరించారు. నిజానికి రెండింతల ధనం చెల్లించడానికి టిప్పు సిద్ధంగా వున్నాడు. బ్రిటిషువారు మొదట ఈ అమ్మకానికి సుముఖత చూపలేదు. మద్రాసు ప్రభుత్వం తనకి తెలియకుండా తిరువాన్కూరు రాజు ఎల్లల విస్తరించటము గర్వించదగ్గచర్యగా ప్రకటించవలసిందని, అతనికి తగు రక్షణని కంపెనీ ప్రభుత్వం ఉపసంహరింప జేయాలని బెంగాలుకి స్పష్టంగా తెలియజేసింది. బెంగాలు ప్రభుత్వం వెంటనే డచ్‌వారితో గాని కొచ్చిన్ రాజుతోగాని సంబం

ధాలు పెట్టుకోవద్దని తిరువాన్కూరురాజుని మందలించింది. టిప్పు అకారణంగా తిరువాన్కూరుని ముట్టడిస్తే బ్రిటిషువారు తమ సహాయాన్ని తిరువాన్కూరుకి అందజేయాలి. కాని తిరువాన్కూరురాజు దుర్గాలను కొని, టిప్పు ఆగ్రహాన్ని ఆహ్వానించినట్లయితే దానికి అతనే బాధ్యతవహించాలి. కంపెనీ సహాయం అటువంటి సమయాల్లో అసమంజసం. ఆ దుర్గాలను తిరిగి డచ్‌వారికి గాని, లేదా కొచ్చిన్‌రాజుకు గాని అప్పజెప్పడానికి రాజు చర్యలను సమర్థించిన బ్రిటిషు రెసిడెంటు పౌనే ఉత్తరోత్తర మంచినడవడితో వుండేటట్లు మందలించడానికి కారన్‌వాలీసును ఉద్దేశించాడు. కాని డచ్‌వారు దుర్గాలను తిరిగి గైకొనడానికి సుముకంగాలేరని రాజా బ్రిటిషువారికి తెలియజేశాడు. ఇంతలో దుర్గాలని అమ్మడానికి డచ్‌వారికి స్వంతంత్రాధికారాలు వున్నాయేమో తెలుసుకోవడానికి బెంగాలు ప్రభుత్వం ఒక విచారణకు ఆజ్ఞాపించింది. అన్ని పత్రాలని చూపక, టిప్పుని ఈ విషయంగా సంప్రదించ కుండానే డచ్‌వారికి దుర్గాలని అమ్మే విషయంలో నిస్సంకోచమైన అధికారాలున్నాయని రాజా బ్రిటిషువారికి తెలియజేశాడు. నిజానికి ఆ ప్రాంతాలు కొచ్చిన్‌రాజు పరిధిలో వుండేవి. ఆ కారణంగా డచ్‌వారు అతనికి కొంతకప్పం కట్టేవారు గూడ. న్యాయచట్టాలకు విరుద్ధంగా అమ్మకం జరిగిందని మద్రాసు ప్రభుత్వానికి నమ్మకం కుదిరింది.

అమ్మకం విషయంపై టిప్పు కోపోద్రిక్తుడైనా తగాదాని బ్రిటిషువారు అంగీకారయోగ్యంగా కుదుర్చుకుంటారన్న నమ్మకంతో దాదాపు అయిదునెలలు నిరీక్షించాడు. టిప్పుకు యుద్ధప్రకటనకై ఎట్టి అవకాశాన్నివ్వరాదని మద్రాసు ప్రభుత్వం కోరింది. కాని కారన్‌వాలీసు క్రమంగా తన ప్రణాళికను మార్చుకొన్నాడు. అయిదునెలల కాలంలో ఏదీ జరగకపోయినందుకు టిప్పు రక్షణ సరిహద్దు ప్రాంతాలని సమీపించాడు. తన ఉనికి రాజా ఉద్దేశాలను మారుస్తుందని ఆశించాడు టిప్పు. కాని రాజు వెనుతిరగనందువల్ల 1789 డిసెంబరు 29 వతేదీ మొదటి సైనిక తగాదా జరిగినంది. టిప్పు పౌనేని ఆహ్వానించాడు గూడ. కాని మద్రాసులో గవర్నరు మారడం పరిస్థితులను తారుమారు చేసింది. టిప్పు క్రాంగనూరు, ఆయకోటలను ముట్టడించాడు. తిరువాన్కూరు రక్షక స్థావరాలని ధ్వంసం చేశాడు. యుద్ధం వేగాన్ని వుంజుకుంది.

భారతదేశ స్వదేశీరాజ్యాల విషయాలలో కంపెనీ జోక్యాన్ని మొదట నిరసించాడు కారన్‌వాలీసు. కానీ వెంటనే తన ఉద్దేశాన్ని మార్చుకొన కనీసం నిజానిజాలు తెలుసుకోకుండా కొచ్చిన్‌రాజు స్థావరాలలో తిరువాన్కూరు రాజు రక్షక

శ్రేణుల నిర్మాణపు అధికారాన్ని గుర్తించాడు. అతను విజయవంతంగా నిజాంతో ఒప్పందం కుదుర్చుకొని మహారాష్ట్రులను గూడ యుద్ధానికి దించయత్నించాడు. మద్రాసు ప్రభుత్వ ఉద్దేశాలను కఠినంగా విమర్శించి, అక్కడి గవర్నరు హాలెండు, టిప్పు యెడ పక్షపాతియని పదవినుంచి తొలగించాడు. అసలు విషయాన్ని తెలియచేయడానికి టిప్పుకి అవకాశం గూడ కల్పించక, కారన్‌వాలీసు డిసెంబరు 29 సంఘటనను యుద్ధప్రకటనగా భావించాడు. రెండవ మైసూరుయుద్ధ సమయంలో యుద్ధఖైదీగా శ్రీరంగపట్నంలో వున్న జనరల్ మెడోస్ మద్రాసు గవర్నరుగా నియమించబడ్డాడు. విచారణ జరిపించాలన్న సూచన తిరస్కరింపబడింది. సంప్రదింపుల మూలంగా సమస్యని పరిష్కరించాలన్న టిప్పు ఉద్దేశము నిర్లక్షింపబడింది. టిప్పు పంపిన న్యాయవాదిని చూడటానికి గూడ మెడోస్ నిరాకరించాడు. బ్రిటిషువారికి, వారి పక్షంవారందరికీ టిప్పుని నష్టపరిహారం చెల్లించమని కోరారు. అందువల్ల మూడవ మైసూరు యుద్ధం అనివార్యమైన కారణాల మూలంగా జరిగిందని చెప్పవచ్చు.

1786 సం॥ లో జరిగిన యుద్ధసమయంలో బ్రిటిషువారు మహారాష్ట్రులకు సహాయం చేయనందువల్ల ఇప్పుడు మహారాష్ట్రులను సైనిక కూటమిలోనికి ఆకర్షించటం సులభమైనపనికాదు. టిప్పు రక్షణ శ్రేణులను ముట్టడించిన తర్వాత ఎంతో అవసరమైన మహారాష్ట్రుల సహాయానికై మాలెట్ పూనాలో కృషి చెయసాగాడు. కానీ వారి సహాయాన్ని అర్థించడంలో మరీ కక్కుర్తి కనిపించిన అది తమ బలహీనతను ప్రదర్శించినట్లవుతుందని మాలెట్ చాలా మెలకువగా వ్యవహరించవలసిందిగా ఆదేశించబడ్డాడు. తాము ముందు పోగొట్టుకొన్న ప్రాంతాలను మైసూరు నుంచి రాబట్టుకోవడానికై అది అనువైన సమయమని మాలెట్ నానాకు నచ్చ చెప్పాలి. అట్టి అక్రమణపై ఆసక్తిగల నానాకి టిప్పుపై యుద్ధానికి దించడంలో మాలెట్‌కు అట్టే కష్టమనిపించలేదు. మహారాష్ట్రులు ఒప్పందానికి సిద్ధంగా వున్నారని 1780 ఫిబ్రవరి 8 వ తేదీన మాలెట్ కారన్‌వాలీసుకు తెలియజేశాడు. మైసూరులో తమకు చెందవలసిన ప్రాంతాలను తిరిగి అప్పజెప్పిన తరువాత మైసూరుకి చెందిన ఇతరప్రాంతాలను అందరూ సమానంగా పంచుకోవాలన్నది మహారాష్ట్రులు తెలియజేసిన షరతులు తుంగభద్రకు ఉత్తరంలో గల భూభాగంపై తమకు మాత్రమే అధికారముండాలనే మహారాష్ట్రుల కోరికను బ్రిటిషువారు అంగీకరించలేదు. మహారాష్ట్రుల సైన్యానికి బ్రిటిషువారి కోరికను బ్రిటిషువారి సైన్యము తోడు వెళ్ళాలి, ఆ సైనిక ఖర్చులను నానా భరించాలి. సంధిపై

1790 జూన్ 6 వ తేదీన సంతకాలు జరిగాయి. పరశురాంబాహు సైనిక నాయకుడిగా నియమించబడ్డాడు. ఈ ఒడంబడికను రద్దు చేయించడానికి టిప్పు తన న్యాయవాదుల్ని డబ్బు సంచీలతో పూనాకు పంప ప్రయత్నించాడు. కానీ అతని ప్రయత్నాలు విఫలమయాయి.

నిజాం ఒప్పందంలో చేరడం పెద్ద సమస్యకాదు. అతనికి కలిగే లాభముల దృష్ట్యా ఒడంబడికలో చేరడానికి కించిత్తుగూడ సంకోచించలేదు. సైనికంగా బలహీనంగా వున్నా, బ్రిటిషువారు వాగ్దానం చేసిన సైనిక సహాయం తన సంశయాలన్నిటినీ తొలగించింది. 1768 లో కుదిరిన సంధి ఒప్పందంకు ఒడంబడికకు ప్రాతిపదికగా వుండాలని మొదట అనుకొన్నారు. కాని మహరాష్ట్రులు గూడ యుద్ధ ప్రవేశం చేసిన కారణంగా ప్రత్యేకసంధి అవసరమైంది. మహరాష్ట్రులు తనపై దురాక్రమణ జరపకుండా నిజాం బ్రిటిషు వారినుంచి ఖచ్చితమైన అభయము కోరాడు. ఇది బ్రిటిషువారిని ఇబ్బందికి గురిచేసినట్లయింది. కానీ నిజాం అట్టి అభయం విషయంలో పట్టుబట్టాడు. అందుచేత కారన్‌వాలీసు తమ సన్నిహితులైన మహరాష్ట్రుల చేతిలో కబళింపబడడం ఎన్నటికీ సహించబోమని వ్యక్తిగతంగా జాబు వ్రాశాడు. దీనితో 1790 జూలై 4 వ తేదీన సంధిపత్రం మీద సంతకాలు జరిగాయి.

ఇతర మరాఠా నాయకులైన భోస్లే, సింధియా, హోల్కార్ మొదలైన వారిని ఆంగ్లేయుల పక్షాన్ని చేరవలసినందిగా కారన్‌వాలీసు కోరాడు. ఉత్తరాదిలో తాను చేసే యుద్ధాలలో కంపెనీ సహాయం చేయడానికి సిద్ధంగా వున్నట్లయితే తను బ్రిటిషువారికి యీ యుద్ధంలో సహాయం చేయడానికి అంగీకరిస్తానన్నాడు. హోల్కార్ గూడ ఎక్కువ ఉత్సాహాన్ని చూపలేదు. అతను నానాసాహెబ్ నిజాం కలిసి టిప్పుని ఎదిరించడం నిరసించాడు. మలబారు స్థానికనాయకులు టిప్పుని ఎదిరించేటట్లు పురిగొల్పటం జరిగింది. టిప్పును ధిక్కరించి, బ్రిటిషువారి నుంచి సహాయాన్ని పొందడానికి, అందుకు ప్రతిగా వారికి కొంత సొమ్ము చెల్లించడానికి అంగీకరిస్తూ కొచ్చిన్‌రాజు వారితో ఒడంబడిక కుదుర్చుకొన్నాడు. అదే విధంగా కన్ననూరు బీబి, కూర్గు రాజు, మైసూరు రాణి మొదలైన వారు గూడ టిప్పుకు వ్యతిరేకంగా బ్రిటిషువారితో చేతులు కలిపేటట్లు ప్రోత్సాహించబడ్డారు.

ఆ విధంగా టిప్పుకి వ్యతిరేకంగా ఒక శక్తివంతమైన కూటమి ఏర్పడింది. టిప్పుసుల్తాను దాదాపు ఏకాకిగా వున్న ఆ సమయంలో సైనిక కూడమి ఏర్పాటుచేయడం అతనిని ఓడించుటకే గాని, కంపెనీ సన్నిహితుడైన తిరువాన్కూరు

రాజు అవసరాలను తీర్చడానికి కాదు. సైనిక ఒప్పందం కంపెనీ తటస్థవ విధానమును విడనాడి రాజ్యాక్రమణ కార్యక్రమాన్ని ప్రారంభిచేందుకు పన్నిన ఒక పన్నాగము మాత్రమే. భారతదేశంలో బ్రిటిషుసామ్రాజ్య విస్తరణకు టిప్పు ప్రధాన ఆటంకమని, అందుచేత అతనితో ఏదో ఒకప్పుడు పోరుతథ్యమని కారన్‌వాలీసు నిశ్చయించాడు. అనువైన అవకాశం దొరకనందువల్ల అంతవరకు టిప్పుని పోనిచ్చారు. ప్రస్తుతం అవకాశం లభించినందువలన బ్రిటిషువారు అవమానంతో ఉపశమనంకోసరం చేసిందని తలచిన మంగళూరు సంధిని త్రోసి పుచ్చడానికి ఉవ్విళ్ళూరారు. వారు మాత్రమే టిప్పుతో యుద్ధానికి దిగినట్లయిన నిజాం, మహారాష్ట్రు టిప్పు పక్షం చేరి అనవసర సమస్యలు కల్పిస్తారని భయపడి బ్రిటిషువారు తమ అధికార వస్తరణ కార్యక్రమంలో ఆ రెండు రాజ్యాలకు అసూయ కలిగించకుండా జాగ్రత్తపడ్డారు. మైసూరు రాజ్యంపై తమ దండయాత్రలని శక్తివంతంగా ఎదుర్కొంటున్నాడని, దక్షిణంలో రోజుకోజుకీ అధికమవుతున్న అతని అధికారాన్ని అరికట్టాలని మహరాష్ట్రు సైనిక కూటమిలో చేరారు. మహరాష్ట్రులకు చెందిన చాలా ప్రాంతము అతని అధీనంలో కొనసాగింది. 1786 లో ఆ ప్రాంతాలను తిరిగి పొందడానికి వారు చేసిన ప్రయత్నం విఫలయయింది. అందువల్ల మహరాష్ట్రుల ప్రతిష్ఠ దెబ్బతిన్నది గూడ. ఇప్పుడు అలాంటి అపజయాలను మరిపించడానికి గొప్ప వీరోచిత ప్రయత్నం అవసరము. 1787 లో కారన్‌వాలీసు టిప్పుకి వ్యతిరేకంగా సైనికి సమాఖ్య గుర్చి ప్రస్తావించగానే, నానా దానికి వెంటనే అంగీకరించడమే గాక, టిప్పుని ఓడించడానికి తగు ప్రణాలికలు గూడ సమర్పించాడు. నానాకి సింధియాతో గల విరోధం మరొక ప్రధాన విషయం. ఉత్తరదేశంలో సింధియా గొప్ప పలుకుబడి సంపాదించుకొన్నాడు. మహరాష్ట్రుల ఉన్నత వర్గాలలో నాయకత్వంకై అంతరంగిక పోరాటం కొనసాగింది. 1786-87 లో మరాటా యుద్ధంలో పోగొట్టుకొన్న ప్రతిష్ఠను పునరుద్ధరించుకోవడానికై పథకాలు వేయప్రారంభించిన నానా ఎత్తుగడలను సింధియా తన సైనిక శక్తిచేత, దౌత్యవితరణ మూలంగా అరికట్ట దలచాడు. ఒక సందర్భంలో నానా తన రాయబారులను పంపి, బ్రిటిషు సహాయంతో సమస్త భారత దేశాన్ని జయించి పీష్వా అధికారమును మహరాష్ట్రుల శక్తిని నిరూపించదలచాడు.[1] కూటమిలో చేరడానికి అంగీకరించిన నానా, వీలైనన్ని అనుకూలమైన షరతులను పొందడానికై సంధిపై సంతకం చేయడంలో కాలహరణచేశాడు. అంతేకాకుండా ఉత్తరోత్తరా వివాదాలు

---

1. P.R.C. No. 88, VOLL. II.

లేకుండడానికై బ్రిటిషువారితో ప్రతి చిన్నవిషయాన్ని గూడ కూలంకషంగా చర్చించి నిర్ణయించదలచాడు. యుద్ధం ముగిసిన తర్వాత బ్రిటిషువారి శక్తి యుక్తులు, వారి దౌత్యము, వారికి గల సంపత్తితో మహారాష్ట్రులు లెక్కచేయరని అతనికి తెలుసు. నిజాం యుద్ధంలో చేరడం భౌతిక లాభాలు పొందడం కోసమే. అతను కట్టవలసిన 'చౌత్' పన్ను కట్టక మహారాష్ట్రులను కించపరచి వారితో సత్సంబంధములు పోగొట్టుకొన్నాడు. కారన్‌వాలీసు అలాంటి పరిస్థితిని ఉపయోగించుకొని నిజాంని సైనిక కూటమిలో చేరవలసినదిగా అహ్వానించడంతో, బ్రిటిషువారి సహాయంతో మహారాష్ట్రుల ఆధీనంనుంచి తప్పుకొనడానికి అది అనువైన సమయంగా తోచింది. మహారాష్ట్రులు కూటమిలో చేరినందు వల్ల నిజాంకి మరొకదారి తోచలేదు. అందువల్ల కూటమిలో చేరిన ముగ్గురి ఉద్దేశాలు వేరు వేరు. బ్రిటిషువారు టిప్పు అధికారాన్ని అణచదలిచారు. నిజాం ఏదో విధంగా మహారాష్ట్రులకు వ్యతిరేకంగా బ్రిటిషువారి సహాయాన్ని పొందాలని నిశ్చయించాడు. వీరిలో ఒక్కరు గూడ నిజానికి టిప్పు తిరువాన్కూరు రక్షణ శ్రేణులపై జరిపిన దాడిని గూర్చి కలత చెందనవారు కాదు. బ్రిటిషువారికి తమ ఇద్దరు సైనిక సహాయక శక్తులవలన రాజకీయ ఉపయోగమే గాని వారినుంచి యుద్ధ సమయంలో సైనిక ఉపయోగం ఏమాత్రంలేదు. వారు టిప్పు పక్షంలో చేరకుండా వుండడమే వారి నుంచి బ్రిటిషువారు పొందగల ప్రధాన ప్రయోజనం.

టిప్పు వారిని కూటమిలో చేరకుండా చేయడానికి తన శక్తికొద్దీ ప్రయత్నించాడు.మాలెట్ ప్రయత్నాలని విఫలం చేయడానికై తాను బకాయి పడిన కప్పాన్ని తన న్యాయవాదుల ద్వారా టిప్పు పూనాకు పంపాడు. తను పంపిన ధనము, పరిస్థితులు తనకు అనుకూలంగా మారుస్తాయని టిప్పు ఆశించాడు. కాని తన న్యాయవాదులు సంధిపై సంతకాలు చేసే తతంగాన్ని మాత్రం కొద్దికాలం నిలుపుచేయించారు. 1790 జూన్ 8 వతేదీన న్యాయవాదులు పీష్వాను స్వయంగా కలుసుకొన్నారు. కానీ మాలెట్ జోక్యం కల్పించుకొని 1790 ఆగస్టు 4 వ తేదీన వారిని అక్కడినుంచి పంపివేయటం జరిగింది. హైదరాబాదులోని మైసూరు రాజ్యాభిమానులు సహాయంతో టిప్పు నిజాంను గూడ కూటమిలో నుంచి ఉపసంహరింపచేయదలిచాడు. ఒక సందర్భంలో నిజాం-టిప్పు సంబంధాలు మెరుగైన, నిజాం తానుగా టిప్పుతో సంధికి సూచించాడు గూడ. కానీ బ్రిటిషువారి దౌత్య సామర్థ్యము మైసూరు న్యాయవాదులకన్న పై చేయి అని నిరూపించబడింది. కలకత్తా రాయబారిగా పంపిన మీర్ ఆలం బ్రిటిషువారి కృషిని సులభం చేశాడు.

టిప్పు అభిమానియైన షాంసుల్ ఉమ్రా మరణించడంతో అతని ప్రయోజనాలకి కొంత అంతరాయం కలిగింది. మహారాష్ట్రుల యెడల గల భీతి చేత నిజాం, వీస్తున్న గాలికి తెరచాప పట్టాడు. యుద్ధప్రకటన తర్వాత గూడ టిప్పు, కూట మిని భేదించడానికి తన ప్రయత్నాలని వదలలేదు. ఇద్దరి ఆస్థానాలలోని ప్రము ఖులతో ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించి, వారికి అనేక ఆకర్షనీయమైన వాగ్దా నాలు సూచించి, ఏదోవిధంగా పోరునుండి విరమింపజేయ ప్రయత్నించాడు. కానీ అతని ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

1790 మే నెల 24 వ తేదీన యుద్ధం ప్రకటించబడడంతో టిప్పు కర్ణా టకలోని గాజలహట్టి కనుమను ముట్టడించి మైసూరుని జయించడానికి మెడోస్, మాక్స్‌వెల్ వేసుకొన్న పథకాలని వమ్ము చేశాడు. యుద్ధపు మొదటిఘట్టంలో శత్రువుల విస్తరణను అరికట్టడంలో కొంతవరకు టిప్పు విజయాన్ని సాధించాడని చెప్పవ చ్చు. తాను దాదాపు మూడు సంవత్సరాలు జాగ్రత్తగా చేసిన పొదుపు మూలంగా ఏర్పడిన నిల్వలలో చాలాభాగం యుద్ధం ప్రారంభమైన కొద్దినెలల్లోనే పూర్తిగా వ్యయమైనదని కారన్‌వాలీస్ స్వయంగా ఒప్పుకొన్నాడు. మైసూరుని జయించ తలపెట్టిన జనరల్ మెడోస్ అధీనములోని బ్రిటిషు సైన్యానికి కాలసిన సరఫరా లకు అంతరాయం కలిగించి టిప్పు వారిని ముప్పుతిప్పలు పెట్టాడు. 1790 సం॥ దండయాత్ర బ్రిటిషువారికి అత్యంత అసంతృప్తితో ముగిసింది. 1791 జనవరి నాటికి టిప్పు, బ్రిటిషు వారిని నిరోధించగలగటమే కాక తాను కర్ణాట కాన్ని ప్రవేశించగలిగాడు. టిప్పు ఎక్కడికి వెళ్ళినా, అక్కడికి అనుసరించి వెళ్ల వలసినవాడుగా మెడోస్‌ను మార్చగలిగాడు. అట్టి పరిస్థితి కారణంగా కారన్‌వా లీసు స్వయంగా సైన్యాధికారము వహించవలసి వచ్చింది. 1791 ఫిబ్రవరి 5 వ తేదీన అతను మైసూరుపై ముట్టడికి బయలుదేరి, కూటమిలోని ఇతర రాజ్యాల సైన్యాలను బెంగళూరుపైకి వెళ్లవలసిందిగా ఆదేశించాడు. మార్చి 5 వ తేదీన అతను బెంగళూరు చేరుకొన్నాడు. అప్పుడు టిప్పుపాండిచ్చేరివద్ద వున్నాడు. టిప్పు తనకి అత్యంత ప్రధానమైన బెంగళూరు దుర్గాన్ని రక్షించడానికై వెంటనే వెళ్ళినా దక్కించుకోలేక పోయాడు. బ్రిటిషువారు సాధించిన ఈ విజయం నిజాం, మహారాష్ట్రులు తొందరగా వారిని చేరుకొని, వారు లేకుండా బ్రిటిషువారు మాత్రమే విజయాలు సాధించకుండా జాగ్రత్తపడ్డారు. మిత్రకూటమిలో సైనికసంఖ్య అమిత ముగా వున్నా వారు సాధించింది మాత్రం అతితక్కువే. మైసూరు రాజ్యపు ఉత్తర ప్రాంతంలోని టిప్పు దుర్గాలని జయించే కార్యక్రమంలో వారు నిమగ్నమయ్యారు.

కారన్‌వాలీసు సర్వ సైన్యాధ్యక్ష పదవిని అలంకరించిన వెంటనే సంప్రదిం పుల ద్వారా యుద్ధాన్ని విరమింప జేయడానికి టిప్పు మరొకసారి ప్రయత్నించా డు. కాని దీనిని కారన్‌వాలీసు పోత్సహించలేదు. టిప్పుని నాశనం చేయడమే అతని ధ్యేయం. పాండిచ్చేరిలోని ఫ్రెంచి గవర్నరు అయిన డిఫ్రెస్నేను టిప్పుని మధ్య వర్తిత్వానికై ఆహ్వానించాడు. కానీ కారన్‌వాలీసు లిఖిత పూర్వకంగా లేని ఏ అభ్యర్థననూ పరిశీలించడానికి నిరాకరించాడు. కానీ టిప్పు వ్రాత పూర్వకంగా కోరడానికి ఇష్టపడలేదు. 1791 సం॥పు మధ్యభాగంలో బ్రిటిషు సైన్యాలు వర్షాల మూలంగా, ఆహారధాన్యాల కొరత వలన, అంటువ్యాధుల కారణంగా, అలసట చేత, కొంత నష్టానికి గురిఅయింది. కారన్ వాలీసు శ్రీరంగపట్టణాన్నుంచి బెంగ ళూరుకు వెనుతిరిగాడు. ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకొని టిప్పు తిరిగి సంప్ర దింపులకి ప్రయత్నించాడు. కానీ అది మళ్ళీ విఫమైంది. హరిపంత్ అంగ్లేయు లని ఆశ్రయించాడని తెలియగానే టిప్పు అప్పాజీరావు, శ్రీనివాసరావులను అతని వద్దకు పంపాడు. మహరాష్ట్రులు గూడ యుద్ధాన్ని విరమించేందుకు యిష్టపడి నట్లు తోచింది. కాని కారన్‌వాలీసు అనుసరించే విషయాలపై కొన్ని చిన్నఅభ్యం తరాలను లేవదీశాడు. టిప్పు న్యాయవాదులు సరాసరి మిత్రకూటమి విడిదిలోకి వెళ్ళడానికి బదులు సంప్రదింపులకై మిత్రకూటమి ప్రతినిధిని మాత్రం కలుసుకో వాలని కారన్‌వాలీసు నిర్దేశించాడు. అటువంటి సంప్రదింపుల సమయంలో మహ రాష్ట్రుల పాత్ర గురించి అతను భయపడి, అట్టి ప్రయత్నాలను ఆటంకపరిచాడు.

సంప్రదింపులు విఫలంచెందడం చేత యుద్ధాన్ని బ్రిటిషువారు మరీ తీవ్రతరం చేశారు. కాని మిత్రకూటమిలోని వారి ఆంతరంగిక తగాదాల వల్ల, టిప్పుయొక్క అప్రమత్తత మూలంగా, ఆహారపదార్థాల కొరత చేత, ఆర్థిక ఇబ్బందుల కార ణంగా వారు అట్టే ముందుకు కొనసాగలేక పోయారు. ఒక సందర్భంలో పర శురాం బాహు నిజానికి నిజాం స్థావరాన్ని ఒక దానిని స్వాధీనపరచుకొని, అతి కష్టం మీద దానిని వదలిపెట్టాడు. టిప్పు ఫ్రెంచివారి సహాయాన్ని అభ్యర్థించా డు. కాని ఫ్రెంచి విప్లవ సంఘటనలకు చేరువలో వున్నందున ఆ దేశం నుంచి ఎట్టి సహాయమూ అందలేదు. కాని ఫ్రెంచివారు అనేక ఉచిత సలహాలు మాత్రం అందజేశారు. టిప్పు ఏవిధంగానైనా మహరాష్ట్రులని తన పక్షానికి త్రిప్పుకొ నాలి, సైనిక కూటమిని విచ్ఛేదించడానికి తాను ధనాన్ని తన శక్తిని వెచ్చించడా నికి వెనుదీయరాదు, బ్రిటిషువారిని ఎదిరించడంలో తాను పెద్ద యుద్ధాలకి దిగక, చిన్ని చిన్ని మెరుపుదాడులు కొనసాగించి వారిని ఇక్కట్లకి గురిచేయాలి. తాను

పెద్ద మొత్తాలలో ధనాన్నివెచ్చించడానికి వెనుదీయరాదని వారు సలహాలనిచ్చారు.

1791 లో వర్షాకాలం ముగియగానే బ్రిటిషువారు యుద్ధాన్ని మళ్ళీ కొనసాగించారు. వారు అనేక దుర్గాలను ధ్వంసం జేసి శ్రీరంగపట్టణంవైపు వెళ్ళారు. 1792 సం॥ ప్రారంభంలో టిప్పు తన ముఖ్యపట్టణానికి వెలుపల సైన్యంతో బాటు విడిదిచేశాడు. కారన్‌వాలీసు దాదాపు 22,000 సైన్యంతో పురోగమించాడు. ఒక్కరోజు కూడ వృథాచేయకుండా కారన్‌వాలీసు శ్రీరంగపట్టణాన్ని చేరిన వెంటనే టిప్పుని ఎదుర్కొన్నాడు. మూడు విభిన్న వైపుల నుంచి అర్ధరాత్రి సమయంలో బ్రిటిషుసైన్యాలు టిప్పుపై విరుచుకపడ్డాయి. మధ్య విభాగానికి కారన్‌వాలీసు స్వయంగా నాయకత్వం వహించాడు. యుద్ధం తీవ్రంగా కొనసాగింది. బ్రిటిషువారు టిప్పుని కోటలోనికి వెళ్ళిపోవలసిందిగా నిర్బంధించారు. యుద్ధం బ్రిటిషువారికి అనుకూలంగా ముగిసింది. టిప్పు స్థావరాన్నంతటిని బ్రిటిషువారు తెల్లవారకముందే ఆక్రమించారు. బ్రిటిషుసేనలు కావేరీనది రెండు పాయలూ కలిసే ప్రాంతములోని, లాల్‌బాగ్ వద్దగల దీవిలో కొంత ప్రాంతాన్ని ఆక్రమించుకొన్నారు. కోట అప్పటికే టిప్పు ఆధీనములో వున్నందువల్ల బ్రిటిషువారు దానిని ముట్టడించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. టిప్పుకి రెండే రెండు మార్గములు కనిపించాయి. యుద్ధము కొనసాగించుట, లేక లొంగిపోవుట. అనేక కష్టాలు వున్నాయని అతనికి బాగాతెలుసు. కనీసం భవిష్యత్తులో తన నష్టాలని భర్తీ చేసేందుకు అవకాశముంటుందనే ఉద్దేశంతో టిప్పు శాంతి ఒప్పందానికి ముందుకొచ్చాడు. అతనివద్దగల బ్రిటిషు ఖైదీలను విడుదలచేసి, అలాంటి ఒక ఖైదీయైన లెఫ్టినెంట్ చామర్స్ ద్వారా శాంతిని కోరుతూ కారన్‌వాలీసుకు ఒక జాబు పంపాడు. కారన్‌వాలీసు శాంతి కోరికను తిరస్కరించడమో ఒప్పుకోవడమో నిర్ణయించుకోవాలి. అతనుఒప్పుకోవడానికే నిర్ణయించుకొన్నాడు. కోటను ముట్టడించే సమయంలో తన సహచరులైన నిజాం, మహారాష్ట్రులు నిజంగా సహాయాన్ని అందజేస్తారా లేదా అని అనుమానించి కారన్‌వాలీసు అలాంటి నిర్ణయానికొచ్చాడు. టిప్పుని సర్వనాశనం చేసిన వారు యీర్ష్య చెందుతారని గూడ అతను అనుమానించాడు. రాజకీయంగా, టిప్పుని కొనసాగింపజేయడమే ప్రయోజనకరం. అందువల్ల కారన్‌వాలీసు టిప్పు రాయబారులైన గులాం అలీఖాన్, అలీ, రేజాలను శాంతి సమావేశానికి ఆహ్వానించాడు. మీర్ ఆలం, గోవిందరావు. కెన్నవె మొదలైనవారు సమాఖ్యరాజ్యాల ప్రతినిధులుగా నియమింపబడ్డారు.

కారన్‌వాలీసు చాలా కఠినమైన షరతులు కోరాడు. మూడుకోట్ల రూపాయలు

శిస్తురాగల భూభాగాన్ని టిప్పు సమర్పించాలి. టిప్పు కుమారు లిద్దరినీ జామీను లగా పంపాలి. నష్టపరిహారంగా ఎనిమిది కోట్ల రూపాయలు చెల్లించాలి. ఇవి అతని షరతులు. వీటిని సవరించడానికై బేరాలు ప్రారంభమయ్యాయి. కారన్వాలీసు టిప్పు రాజ్యంలో సగభాగానికి ఆరుకోట్ల రూపాయల నష్టపరిహారానికి తగ్గాడు. తర్వాత యిది మూడు కోట్లకు తగ్గింపబడింది. విజేతలు రాబట్టుకోవడానికి అది అత్యంత అధికమైంది. కారన్వాలీసు గూడ అంతకన్న ఎక్కువ అడిగినట్లయితే టిప్పు యుద్ధం కొనసాగించడానికి నిర్ణయించుకుంటాడని ఉద్దేశించాడు. కూటమిలోని అధికారవర్గానికై హరిపంత్ ముప్పై లక్షల రూపాయలు దర్బారు ఖర్చుల క్రింద కోరాడు. ఇది అంగీకరించబడింది. దీనితో ఒక విధమైన శాంతి ఒప్పందపు సంతకాలు జరిగాయి. అనుకొన్నట్లు టిప్పు కుమారులు జామీనులుగా వెళ్లారు. ధనము చెల్లించబడింది. కాల్పుల విరమణ జరిగింది. కాని సంధి షరతులను ఖరారు చేయడంలోగల కష్టాలు దీని తర్వాత ప్రారంభమయ్యాయి. టిప్పు సామ్రాజ్యంలో అర్ధభాగాన్ని నిర్ణయించడానికై తాను సమర్పించిన ఆదాయ వ్యయ లెక్కలను బ్రిటిషువారు త్రోసిపుచ్చారు. వీలైనంత తక్కువ భూభాగాన్ని అప్పజెప్పాలనే ఉద్దేశంతో టిప్పు సరిహద్దు ప్రాంతాల విలువలను అధికంగా చూపాడని బ్రిటిషువారు భావించారి. టిప్పు అందజేసిన అంచనాలను త్రోసిపుచ్చి బ్రిటిషువారు క్రొత్తవి రూపొందించారు. బ్రిటిషువారికి బారామహల్, సేలం, దిండిగల్లు, కాలికట్, కరూర్, ధర్మపురం కూర్గ్ మొదలైన ప్రాంతాలు లభించాయి. మహారాష్ట్రులకు బసవపట్నం, చిత్రదుర్గ, రాయదుర్గ, హర్పనహళ్ళి సంక్రమించాయి. కూర్గ్‌ని కలుపుకోవడం టిప్పుని కృంగతీసింది. కూర్గ్ బ్రిటిషువారి ప్రాంతాలకు చేరువగా గూడ లేదు. టిప్పు కూర్గును శ్రీరంగపట్టాణానికి ముఖద్వారంగా భావించాడు. అది ఒక రోజు ప్రయాణ దూరానికన్న ఎక్కువకాదు. కారన్వాలీసు కూర్గ్ విషయంలో పట్టుబట్టాడు. దీనపై సంప్రదింపులు స్తంభించాయి. ఈ సమస్య మరీ గడ్డుగా పరిణమించి యుద్ధము పునః ప్రారంభమవుతుందా అనే అనుమానం కలిగింది. ఫిరంగులు సిద్ధమయ్యాయి. సైన్యాలు ముందుకు కదిలి కోటను ముట్టించడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. అందుకని టిప్పు యీ ప్రధానమైన అంశాన్ని గూడ ఒప్పుకొన్నాడు. ఆఖరికి మార్చి 18 వ తేదీన సంధిపై సంతకాలు చేయబడ్డాయి. ఒక వారం తరువాత కూటమి రాజ్యాలు తమ తమ సైన్యాలను వెనుకకు మళ్ళించాయి.

యుద్ధంలో టిప్పు ఓడిపోయాడు. విజేతలు తాము అనుకొన్నదాని కన్న

మిన్నగా లాభాలు పొందారు. కూటమిలోని రాజ్యాలు సరిసమానంగా పంచుకోవాలి. అనే పద్ధతిమీద ఆక్రమిత ప్రాంతాలు విభజించబడ్డాయి. ముందు అనుకొన్నవిధంగా పురాతన కాలం నుంచి గల అధికారాలని పునరుద్ధరించుకోవాలనే సిద్ధాంతం అనుసరించబడలేదు. విభజనలో, టిప్పురాజ్యం యొక్క శిస్తు మాత్రం ప్రమాణంగా తీసుకోబడింది. కానీ రాజ్య వైశాల్యంగాదు. మొత్తం శిస్తు రెండుకోట్లు నలభై లక్షల రూపాయలుగా మదింపు వేయబడింది. అందులో సగం మొత్తాన్ని కూటమిలోని ఒక్కొక్కరికే 39.5 లక్షలుగా పంచుకొన్నారు. 1772 సం॥ ముందు తమ ఆధీనంలోవుండి పోగొట్టుకొన్న తుంగభద్ర వరకు గల ప్రాంతాన్నంతా మహరాష్ట్రులు వశపరచుకొన్నారు. తుంగభద్ర, కృష్ణా నదుల మధ్య భూభాగం నిజాం వశమైంది. మహరాష్ట్రులకు లభించిన ప్రాంతాలు ఒకేవైపుగా వున్నాయి కాని నిజాంకి రెండు ప్రాంతాలలోను, బ్రిటిషువారికి మూడు విభాగాలలోను వచ్చాయి. సారహీనమైన ప్రాంతాలను, గుట్టమిట్టలుగల భూభాగమని బ్రిటిషువారు అత్యంత విశాలమైన స్థలాన్ని పొందారు. నిజాంకి మహరాష్ట్రులకు సారవంతమైన, వ్యవసాయయోగ్యమైన ప్రాంతాలు లభించగా బ్రిటిషువారికి లభించిన ప్రాంతము రాజకీయంగా, సైనికంగా మిక్కిలి కీలకమైన ప్రదేశము. బారామహల్, సేలం, పశ్చిమ కనుమలకు గల రహదారులపై అధిపత్యాన్ని గలిగించాయి. కూర్గు, కృష్ణగిరి, రాయకోట, బారామహల్, దిండిగల్ మొదలైన ప్రాంతాలమూలంగా బ్రిటిషువారు కోరమండల్ తీరానికి బలమైన సరిహద్దులను నిర్ణయించుకోగలిగారు. మునుపటి రెండు మైసూరు యుద్ధాలలో పోగొట్టుకొన్న ప్రతిష్ఠకి టిప్పుపై పగతీర్చుకోవటం మానసికంగా బ్రిటిషువారికి గలిగిన అతి పెద్ద లాభము.

టిప్పుని పూర్తిగా నాశనంచేయడానికి కారన్‌వాలీసు ఎందుకు వెనుకాడాడనే ప్రశ్న తప్పక తలెత్తుతుంది. మహరాష్ట్రుల ఈర్ష్యకి ఇది కారణమవుతుందనే భయం కాదు. మహరాష్ట్రులు అంత గొప్ప శత్రువులని, అభేద్యులని అతను ఊహించ లేదు. మహరాష్ట్రుల పక్షం కేవలం సదాపోరాడే నాయకుల కూటమని, ఆ కూటమిని వ్యక్తిగత ఆశల ఆకర్షణలో వేరుపరచడం కష్టతరమైనపని కాదని అతనికి తెలుసు. కాని అసలు కారణం మాతృదేశం నుంచి వచ్చిన ఆదేశములని చెప్పవచ్చు. ఇంగ్లండు ఆ సమయంలో విప్లవయుగపు ఐరోపా రాజకీయాలలో తలమునకలుగావుంది. ఇంగ్లండులో మంత్రులందరూ భారతదేశంనుంచి సైన్యాలని తిరిగి తప్పించమని ఒత్తిడి చేశారు. అందుచేత కారన్‌వాలీసు మూడవ మైసూరు యుద్ధాన్ని నిరవధికంగా కొనసాగింపలేకపోయాడు. కంపెనీ అధికారానికి మిక్కిలి క్లిష్టమైన

సమయంలో ఆదుకొనగలిగినా వారన్‌హేస్టింగ్స్, అభిశంసనా తీర్మానాన్ని తప్పించుకోలేక పోయాడు. అనువైన షరతులను త్రోసిపుచ్చి యుద్ధం కొనసాగించి ఒక వేళ విజయము సాధించక పోయినా కారన్‌వాలీసు కూడ అటువంటి పరిస్థితి కలగదనే నమ్మకమేముంది! పార్లమెంటులో తనని సమర్థించడానికి దుండాస్, విలియం పిట్ మొదలైన వారున్నప్పటికీ, నిష్కారణంగా యుద్ధాన్ని ప్రారంభించినందుకు మొదట అనేకులు కారన్‌వాలీసును విమర్శించారు. అమెరికా భూభాగంపై 13 వలసలు పోగొట్టుకొన్న విషయము బ్రిటిషువారు మరచిపోలేదు. కంపెనీ అధికార్ల వలెగాక పార్లమెంటు దురుసుగా నిర్ణయాలు చేయడం నిరసించింది. మిత్రకూటమి రాజ్యాల ప్రవర్తన గూడ ఆందోళన కలిగించింది. వారు రహస్యంగా టిప్పుతో మంతనాలు జరుపుతారని బ్రిటిషువారు భయపడ్డారు. యుద్ధసమయంలో మహరాష్ట్రుల ప్రయత్నాల ప్రయత్నాలు మందగొడిగా కొనసాగాయి. నిజాం సేనలు ఎందుకూ పనికిరాలేదు. అంటువ్యాధులు, ప్రతికూలించిన వాతావరణము. ఆహార పదార్థములు, ఇతర పనిముట్లు లభించకపోవటం మొదలైన సమస్యలతో యుద్ధం కొనసాగించటం సమస్యకు లోనైంది. అందువల్ల యుద్ధం బ్రిటిషువారికి మిక్కిలి అనుకూలంగా, శత్రువుకి అమిత ప్రతికూలంగా, బ్రిటిషు పక్షము వహించిన వారిని అతి శక్తి వంతులుగా చేయకుండా ముగిసిందని కారన్వాలీసు ఊహించడంలో నిజం లేకపోలేదు.

సంధి, టిప్పుకి చాలా ప్రతికూలంగా పరిణమించిది. అతని ఆర్థిక రాజకీయ, సైనిక స్థితిని సడలించింది. హైదర్ అధికారానికి వచ్చిననాటినుంచి మైసూరు అట్టి గొప్ప పరాజయాన్ని ఎప్పుడూ పొందలేదు. మైసూరు బెబ్బులి గోళ్ళు కత్తిరింపబడి బోనులో వేయటం జరిగింది. ఒక విదేశీ అధికారాన్ని అరికట్టాలనే అతని ప్రగాఢ వాంఛ ఎంతో దురుసుగా ఆపుచేయబడింది. అతని సైనిక పేరు ప్రతిష్ఠలు దెబ్బతిన్నాయి. తన రాజ్యము తునాతునకలైంది. దిండిగల్లు, చాలా సారవంతమైన మండలాలు ఇచ్చి వేయడంచేత రాజ్యపు ధాన్యగారాలు పోగొట్టుకొన్నాడు.

# 6

# తుఫాను ప్రారంభము

మైసూరులో ఆంగ్లేయుల సంబంధాలు శ్రీరంగపట్నం సంధి తర్వాత వెల్లస్లీ వచ్చేంతవరకు దాదాపు ప్రశాంతంగానే కొనసాగాయి. యుద్ధసమయంలో జరిగిన నష్టాన్ని పునరుద్ధరించుకోవడానికి టిప్పు ప్రయత్నించాడు. సంధి షరతుల ప్రకారం చెల్లించవలసిన వాటినన్నిటినీ అతను చెల్లించి పూచీ దారులుగా పంపిన కొడుకుల్ని రప్పించుకొన్నాడు. ఇరుపక్షాలూ సమస్యలన్నీ పరిష్కరించుకొని రాజీపడ్డట్టుగానే అనిపించింది. కానీ నిజానికి తనపై దెబ్బతీసిన బ్రిటిషువారిని మాత్రం టిప్పు మరువనూ లేదు, క్షమించనూలేదు. యుద్ధము ముగిసిన వెంటనే టిప్పు తన పరిపాలనా యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించాడు. సైన్యము, నౌకాదళము, వర్తక, వాణిజ్యాది అన్ని వ్యవస్థలలోను మార్పులుచేసి తన ఓటమి మరక గుర్తులని తుడిచివేయతలచాడు. తాను పోగొట్టుకున్న ప్రాంతాలని టిప్పు పునరాక్రమించుకోవటం ప్రయత్నిస్తాడని కారన్‌వాలీస్ మిత్రకూటమిని రద్దుచేయక వుంచాడు. కొన్ని సరిహద్దు ప్రాంతాల మార్పులు, మైనాడ్‌ను బలవంతంగా బ్రిటిషువారు ఆక్రమించుకోవడం వంటి వాటి మూలంగా ఇద్దరికీ కొన్ని తగాదాలు ఉత్పన్నమయ్యాయి. అదేవిధంగా అమర, సుల్య ప్రాంతాలను బ్రిటిషువారు తమ ఆధీనంలో కొనసాగింపజేశారు. ఇది టిప్పుకి తీవ్ర అసంతృప్తి కలిగించింది.

సర్ జాన్ షోర్ రాకతో టిప్పు-అంగ్లేయుల సంబంధాలు ఎంతో మెరుగైనాయి. 1794 లో సర్‌జాన్ జామీనులను విడుదలచేశాడు. అతను భారతదేశ రాజుల వ్యవహారాలలో చాలా తెలివిగా తటస్థవిధానాన్ని అనుసరించాడు. మహరాష్ట్రుల చేత కుర్డ్లా దగ్గర నిజాం ఓడించబడడం, పీష్వా రెండవమాధవరావు. మరణము, వారసత్వపు యుద్ధము, రెండవ బాజీరావు, దౌలతారావు సింధియాలు అధికారానికి రావడం, బ్రిటిషువారు తటస్థవిధానాన్ని అనుసరించడం వంటి పరి

స్థితులు టిప్పు పోగొట్టుకొన్న గౌరవాన్ని తిరిగి పొందడానికి అనుకూలించాయి. 1790 లో ఏర్పడిన కూటమిని యీ పరిస్థితులు ఛేదించగలిగాయి. 1795 లో జరిగిన మరాఠా నిజాం యుద్ధము ఒక విధంగా బ్రిటిషు వారికి, మహరాష్ట్రులకు మధ్య దక్కనులో నాయకత్వసమస్యకై జరిగిన యుద్ధం అని అనవచ్చును.

1796 లో రీపాడ్ అనే ఒక నౌకాధికారి శ్రీరంగపట్నం వచ్చాడు. అతను ఫ్రెంచి రాయబారినని నటించి, మారిషస్‌లో ఒక పెద్ద ఫ్రెంచి నౌకాదళమున్నదని, టిప్పుకి అవసరమున్నట్లయితే ఆ దళముని పంపటం జరుగుతుందని తెలిపాడు. ఈ కథని టిప్పు నిజమని నమ్మి వెంటనే అధికారికంగా ఒక దౌత్యవర్గాన్ని మారిషస్‌కు పంపి, సహాయాన్ని కోరమన్నాడు. టిప్పు మంత్రులు రీపాడ్‌ది కట్టుకథలేమో అని అనుమానించినా, టిప్పు దీనిని నమ్మి రీపాడ్‌ను అనుసరించడానికి నలుగురు సభ్యులుగల బృందాన్ని మారిషస్‌కు పంపి, అక్కడి గవర్నరు 30,000 నుండి 40,000 సైన్యాన్ని కగిన నౌకలతో పంపమని కోరాడు. హుస్సేన్ ఆలీఖాన్, మహమ్మద్ ఇబ్రహీం అనే టిప్పు రాయబారులు 1797 డిసెంబరు 5 వ తేదీన బయలు దేరి 1798 జనవరి 19 వ తేదీన మారిషస్ దీవిని చేరుకున్నారు. వారు అక్కడి గవర్నరయిన మాలర్టిక్ చేత సాదరంగా ఆహ్వానింపబడ్డారు, కానీ అక్కడ టిప్పుకు సహయంగా పంపేందుకు ఎట్టి సైన్యము లేదని తెలిసి ఎంతో నిరుత్సాహపడ్డారు. రీపాడ్ చెప్పింది పచ్చి అబద్ధం. రాయబారులు ఉత్త చేతులతో తిరిగి వెళ్ళడం మాలర్టిక్‌కు ఇష్టంలేదు. అందుకని గవర్నరు మారిషస్ ప్రజలకు టిప్పు సైన్యంలో చేరవలసిందని ఒక విజ్ఞప్తి చేశాడు. ఆ విజ్ఞప్తిలో ఇలా ప్రకటించబడింది. "భారతదేశం నుంచి బ్రిటిషువారిని తరిమివేయడానికి నిశ్చయించుకొన్న టిప్పు, వారిపై యుద్ధము ప్రకటించడానికి ఫ్రెంచివారిచ్చే సహాయ సమయానికై వేచి వున్నాడు."

ప్రకటనలో కెల్ల ఇది చాల అభ్యంతరకరమైన భాగము. అన్ని విషయాలు ఎంతో రహస్యంగా వుంచాలని వారి ఉద్దేశాలని ప్రకటింపుల మూలంగా తెలియజేయ కూడదని ఆదేశించబడిన రాయబారులని ఇబ్బందిలో పెట్టింది. మారిషస్ దీవిలో అప్పటికే సిద్ధంగా వుంచిన సైన్యాలని తీసుకుని వెళ్ళడానికి వచ్చామని స్వచ్ఛంద సైన్యాలను క్రొత్తగా చేర్పించుకొనడానికి రాలేదు అని మాలర్టిక్‌తో అన్నారు. ఐనప్పటికి ఒట్టి చేతులతో రాకుండా వారు 99 మంది చేతిపని వారిని తమతోబాటు తీసుకొచ్చారు.

వెల్లస్లీ యుద్ధ ప్రకటనకి మారిషస్ గవర్నరు చేసిన విజ్ఞాపన ప్రధాన కారణ

మైనందువల్ల టిప్పు వ్యక్తిగత ఉద్దేశాలను మాలర్టిక్ బహిరంగపరచడానికి కారణం ఏమిటి అనే ప్రశ్న ఉదయించక తప్పదు. దీనిపై అనేక విభిన్న అభిప్రాయాలు వెల్లడిఅయ్యాయి. మారిషస్ దీవిలోని విప్లవకారులందరినీ తొలగించడానికి ఉద్దేశించబడినదని వెల్లస్లీ భావించాడు.[1] మాలర్టిక్ గొప్పలు పలుకుతూ వ్రిరవీగాడని మిల్ భావించాడు.[2] కానీ యిది బ్రిటిషువారిపై దెబ్బతీయడానికై అమిత ఉత్సాహంతో మాలర్టిక్ అజాగ్రతతో చేసిన పొరపాటని మనకి మనకి తెలుసు. ఫ్రెంచి వారు ఆ సమయంలో అమితోత్సాహంతో వున్నారు. ఫ్రెంచి విప్లవం సంఘటనలు, విప్లవ పుత్రుడైన నెపోలియన్‌యొక్క ఘనవిజయాలు ఫ్రెంచి జాతినే ఉత్సాహపరచాయి. దానికితోడు కెయిరోనుంచి నెపోలియన్ బ్రిటిషువారి ఇనుపసంకెళ్ల నుంచి స్వదేశీ రాజుల్ని రక్షించడానికై వారినుంచి సైనిక సహాయము పొందడానికి పంపిన దౌత్యబృందము అలాంటి ప్రకటనకి మూలకారణం. అందుకని మారిషస్‌దీవిలో జరిగిన సంఘటనలు టిప్పు తీసుకున్న చొరవను ప్రతిబింబింపజేస్తాయికానీ అతను నిర్దోషియని కప్పిపెట్టడానికి వీలులేదు.

1792 లో అధికారానికి వచ్చిన ఆఫ్ఘన్‌రాజు జామన్‌షాతో, టిప్పు సంబంధాలు నిలుపుకున్నాడు. అహమ్మద్‌షా అబ్దాలికి మనుమడైన జామన్‌షా తాతవలె సైనికంగా పేరుపొందినవాడు. తనతో వివాహ సంబంధములు కూడ గల మొగలాయిల అధికారాన్ని ఢిల్లీలో పునరుద్ధరించడానికై భారతదేశంపై దండయాత్ర చేయడానికి సిద్ధమయ్యాడు. 1796 లో టిప్పు ఇద్దరు రాయబారులని కాబూలుకు పంపి తాను అనుకొన్నట్లు భారతదేశంపై దండయాత్ర చేయవలసిందిగా ప్రోత్సహించాడు. టిప్పు అభ్యర్థనకి అంగీకారం తెలిపిన షా అదే విధంగా తాను భారతదేశంపై వెంటనే దండయాత్ర చేసే ఉద్దేశాన్ని తెలిపాడు. 1798 డిసెంబరులో జామన్‌షా భారతేదేశంపై తరలి లాహోరు వరకు వచ్చాడు. కాని 1799 జనవరిలో బ్రిటిషువారు పారశీకులను ప్రోత్సహించి ఆఫ్ఘనిస్థాన్ పై దండెత్తేటట్లు చేసిన కారణంగా జామన్‌షా వెంటనే వెనుతిరిగి వెళ్లవలసివచ్చింది. వెల్లస్లీ మొరాదాబాద్ నుంచి ఈరాన్‌కు ఒక షియా మతస్థుని పంపగా అతను షియా-సున్ని విభేదాలు సృష్టించి అపాయాన్ని అరికట్ట గలిగాడు. లేకుంటే వెల్లస్లీ అన్నట్లు "విజయోత్సాహము, మత ప్రభావము, దోచుకోవడమనే దురాశ అన్నీ కలిసి, ఔరంగజేబు కాలం తర్వాత ఎప్పుడూ ఏ ఒక్క సమయంలో గూడ ఒకే ఒక్క

---

[1] Minutes of Wellersley, Aug 12, 1798, Martin, Despatches, Vol I.P. 82.
[2] Mill, *History of India*, Vol. VI, PP. 76-84.

కారణానికి గుమికూడని విధంగా కలిసి వుండేవారు."[1]

సర్ జాన్ షోర్ చేతులలో అనేక యాతనలుపడిన అయోధ్యనవాబు వజీర్ అలీస్థానంలో నియమించపడిన సాదత్ అలీఖాన్ జామన్‌షాతో లాలూచి పడ్డాడని అనుమానించబడింది. అతను బనారస్‌లోని బ్రిటిషు ఎజంటు ఆయన చెర్రీని చంపి నగరాన్నుంచి పారిపోయాడు. ధక్కానవాబు వాయిబ్ సోదరుడైన షుమ్సుద్దౌలా గూడ జామన్‌షాను భారతదేశాన్ని జయించవలసిందిగా ఆహ్వానించాడు. కానీ బ్రిటిషువారి దౌత్యధిక్యత భారతీయుల పథకాలన్నిటినీ నిరుపయోగం చేశాయి.

రెండు యుద్ధాల మధ్యకాలంలో ఆ విధంగా టిప్పు మరయొక పోటీకి తగు ప్రయత్నాలలో నిమగ్నమయ్యాడు. అతని మొదటి కృషి తన స్వంత రాజ్యాన్ని చక్కబరచడం. వ్యవసాయాన్ని అభివృద్ధిపరచి, వర్తక, వాణిజ్యాలను పెంపొందించి, తన నిల్వలను అధికం చేసుకొని మళ్ళీ బ్రిటిషువారిని ఎదిరించడానికి అవకాశానికై ఎదురుచూడ తలచాడు. రాజ్యాన్ని విస్తరింపచేయాలనే దృష్టి అతనికి లేదుగాని ఉన్న రాజ్యాన్ని సంరక్షించుకుని వీలైతే తాను ముందు పోగొట్టుకొన్న ప్రాంతాలని తిరిగి రాబట్టుకోవడం అతను గాఢంగా వాంఛించాడు. ఇది తాను ఏక పక్షంగా సాధించడం దుర్లభమని తలచాడు. తన విరోధి ప్రతిసారీ అనేకుల సహాయంతో గాని తన్ను ఎదిరించలేదని అతనికి తెలుసు. అందువల్ల అతను స్వదేశీ విదేశీ రాజ్యాల నుంచి సైనిక సహాయాన్ని పొందడానికై శాయశక్తులా కృషిచేశాడు. కానీ అతని ప్రయత్నాలు ఫలించలేదు. అనేకసార్లు అతను ఫ్రెంచి వారి సహాయానికై ప్రయత్నించి విఫలుడైనా, అక్కడ ఎర్పడిన క్రొత్త ప్రభుత్వము భారతదేశం నుంచి బ్రిటిషువారిని తరిమికొట్టేందుకు ఆసక్తిచూపిస్తుందని టిప్పు భావించాడు. నెపోలియన్ అట్టి ఉద్దేసంతో అప్పటికే స్వదేశాన్ని వీడినందువల్ల టిప్పు అలా అనుకోవడంలో విడ్డూరం లేదు. ఫ్రెంచివారు మధ్య ఆసియాలో ఆటంకము పొందటం అటు నెపోలియన్‌కి ఇటు టిప్పుకి దురదృష్టకరము. లేకుంటే చరిత్ర గతి మరియొక్క రకంగా వుండేది. అదే విధంగా జామన్‌షా, లాహోర్ నుంచి తిరిగి వెళ్ళవలసిన అవసరం లేనట్లయితే ఏమ జరిగి వుండేది అనేది ఒక కుతూహలమైన ప్రశ్న. శత్రు అధికారాన్ని ఛేదించడానికి టిప్పులో ఆసక్తి లోపించినదని చెప్పడానికి గూడ ఆస్కారము లేదు. అతను అనుసరించిన విధానము ప్రశ్నించవచ్చుగాని, క్రియా శీలత అనుకొన్నది సాధించాలనే కార్యదీక్ష మాత్రం సందేహించరానివి.

[1] Martin, *Despatches of Wellesley*, Vol, Appendix E.

# 7

## ఆఖరి ఘట్టము

టిప్పు మారిషన్ దీవికి తన దౌత్యవర్గాన్ని పంపడం, బ్రిటిషువారికి అతన్ని నాశనం చేయడానికై ఒక సాకు దొరికినట్లయింది. అతని కార్యక్రమాలను ఎంతో ఆసక్తితో గమనిస్తూ వచ్చిన బ్రిటిషువారు అటువంటి అపాయకర శత్రువుని తొలగించడా నికి ఎట్టి అవకాశాన్నయినా జారవిడచుకోరు. కాని 1798 లో తనని పూర్తిగా ధ్వంసంచేయడానికి బ్రిటిషువారు నిశ్చయించుకోవడానికి టిప్పు ఏ విధంగానూ రెచ్చగొట్టలేదు. విదేశీ రాజ్యాలని సంప్రదించడం ఆ రోజులలో గొప్ప అసాధా రణ విషయమేమీ కాదు. టిప్పు అలాంటి విదేశీశక్తులతో సంబంధాలకై ఎక్కువ ఆసక్తిచూపాడు. అతను మారిషస్ నుంచి పొందిన సహాయం అతి తక్కువ మాత్ర మే. తాను జామన్‌షాతో ఏర్పరచుకున్న సంబంధాల మూలంగా ఉత్పన్నమైన అపాయం పూర్తిగా తొలగించబడింది. అయినా వెల్లస్లీ మైసూరుని ముట్టడించా డు. దానికి కారణాలు భారతదేశం పట్ల బ్రిటిషువారు అనుసరించిన పద్ధతులలో గల మార్పులని చెప్పవచ్చు. వెల్లస్లీ రాక తర్వాత భారతదేశంలో ఏ స్వతంత్ర రాజ్యమూ బ్రిటిషువారికి సరితూగదనే ఉద్దేశం ప్రచారము చేయబడింది. బ్రిటి షువారి సర్వాధికారాన్ని శిరసావహించి, అణగిమణగి వుండవచ్చు లేదా సర్వ నాశనాన్ని చవిచూడవలసిందే. టిప్పు ఇటువంటి అవమానకర స్థితిని అంగీకరిం చేందుకు సిద్ధంగా లేని కారణంగా తగాదా అనివార్యమైంది. బ్రిటిషువారు తమ శత్రువులందరినీ ఒకరి తర్వాత ఒకరిని తొలగించి తమ అధిక్యతను నెరపుకుం టారని అతనికి తెలుసు. ఇటువంటి అపాయకర పద్ధతిని అవరోధించడానికై తన జీవితాంతం శ్రమించాడు. ఎదురీత కొనసాగించాడు. కానీ తన అభీష్టాన్ని సాధిం చుకోలేక పోయాడు.

లార్డ్ మార్నింగ్‌టన్ అయిన వెల్లస్లీ 1797 అక్టోబరులో గవర్నరు జనరల్‌గా నియమించబడి 1798 లో భారతదేశం చేరుకొన్నాడు. టిప్పు అతనికి స్వయాన

అభివందనలు పంపాడు. కాని కొద్దికాలంలోనే టిప్పుని నాశనం చేయడానికై యుద్ధము ప్రకటిస్తాడన్న విషయాన్ని ఎవరూ ఊహించలేదు. టిప్పుపై మరి యొక్క యుద్ధం అత్యవసరమని వెల్లస్లీ భావించాడు. దీనికి అనేక కారణాలు వున్నాయి. టిప్పు తన పరిస్థితిని బాగా అభివృద్ధిపరచుకొన్నాడు. తాను పోగొట్టు కొన్న ప్రాంతాలను పునరాక్రమించుకోవడానికై శాంతి సంధిని త్రోసిరాజనవచ్చును. తాను భారతదేశాన్ని ఆక్రమించుకోవడానికై రమ్మని ఆహ్వానించిన జామన్‌షాతో టిప్పు సంబంధాలు కొనసాగించాడు. అతడు బ్రిటిషువారికి వ్యతిరేకంగా సైనిక కూటమిని ఏర్పరచడానికై నిజాం, మహరాష్ట్రులు ఫ్రెంచివారితో సంబంధాలకై ప్రయత్నించాడు. భారతదేశంలో బ్రిటిషు అధికారాన్ని తొలగించడానికై మారి షస్ దీవికి ఒక రాయబారాన్ని పంపి ఫ్రెంచి సహాయాన్ని అర్థించాడు మారిషస్ నుంచి పొందిన సహాయం అతి కొద్దిపాటిదే అయినా టిప్పు కొనసాగించిన విష యంగా టిప్పుని సంజాయిషీ కోరదలచలేదు. అట్లా అతన్ని కోరినట్లయితే ఇత రుల దృష్టిలో తాను తక్కువ అవుతానని టిప్పుకి యుద్ధం ప్రకటించే అవకాశ మించ్చినట్లవుతుందని బావించాడు. నష్టపరిహారం ఇమ్మని అడగడం గూడ అవ సరంలేదని భావించాడు. కారణం, టిప్పు అపాయాన్ని తలపెట్టాడే కాని అపా యాన్ని కలుగజేయలేదు. కాబట్టి టిప్పు ఏ ఆస్తినీ ఆక్రమించుకోలేదు. ఏ ప్రాంతం పైనా దాడి చేయలేదు. ఏ అధికారాన్ని ఉల్లంఘించలేదు. అందుచేత నష్టపరి హారం చెల్లించమని న్యాయబద్ధంగా అడిగే వీలులేదు. అయినా వెల్లస్లీ ప్రకారం టిప్పు శిక్షించబడాలి. ఎందుకంటే అతను ఒకవైపు స్నేహాన్ని అభిలషిస్తూనే బ్రిటిషువారిని నాశనం చేయడానికి అవకాశాలు తలపోస్తూనే వచ్చాడు.

?, ఈ కారణాలన్నీ కేవలం సాకు మాత్రమే. యుద్ధానికి అసలు కారణం మారి షస్‌కి టిప్పు పంపిన రాయబారం గాని, మాలర్టిక్ ప్రకటన గాని, నెపోలియన్ ఈజిప్టుని జయించడం గాని, జామన్‌షా జయిస్తాడన్న భయంగాని కాదు. యుద్ధా నికి అసలు కారణం భారతదేశంలో కంపెనీ అధికారాన్ని విస్తృతపరచే ఉద్దే శంలో వెల్లస్లీ అనుసరించిన సామ్రాజ్యతత్వ విధానం మాత్రమే. అంత వరకు అనుసరిస్తూ వచ్చిన తటస్థవిధానాన్ని విడిచి కంపెనీ డైరెక్టర్లు యుద్ధపిపాసియైన గవర్నర్ జనరల్‌ను ఏరి కోరి నియమించారు. మాలర్టిక్ ప్రకటన చెవిలోపడడా నికి గూడ ముందే టిప్పుని ఓడించడానికి తన పథకాలని తయారుచేసుకొన్నా డు. భారతదేశానికి వస్తూ, గుడ్‌హోప్ అగ్రమునుంచి అతను వ్రాసిన జాబుల మూలంగా టిప్పుని నాశనం చేయాలన్న అతని ప్రగాఢ వాంఛ స్పష్టమవుతుంది.

టిప్పు అంతకుముందు అనేకసార్లు సహాయానికై ఇతర దేశాలకి రాయబారులని పంపినా, అవి యుద్ధ ప్రకటనకి ప్రధాన కారణాలుగా భావించబడలేదు. టిప్పు పూనా, హైదరాబాదుతో జరిపిన సంప్రదింపులు సర్‌జాన్ షోర్‌కు తెలియనిది కాదు. కానీ వాటిని గూర్చి అతను పట్టించుకోలేదు. షోర్ భారతదేశాన్ని వదలి వెళ్లిన తరువాత యుద్ధం అనివార్యమయే విధంగా ఎ గొప్ప పరిణామాలు జరగ లేదు. కానీ హైదరాబాదులో ఫ్రెంచి సైన్యాన్ని సమీకరించిన రేమాండ్ మరణము, స్వదేశీ రాజ్యాల నుంచి టిప్పు సహాయాన్ని పొందలేక పోవడం మారిషస్ దీవి నుంచి కేవలం 100 మంది సైనికులతో కూడిన అతి చిన్న సైన్యాన్ని పొందడం వంటివి టిప్పు ఏ విధంగానూ శాంతి పరిస్థితులకు అంతరాయం కలిగించలేదని నిరూపించాయి. కీలకమైన ప్రాంతాలన్నీ బ్రిటిషువారిచేతులలో వుండి, 1792 లో టిప్పు అధికారం పూర్తిగా నాశనం చేసిన కారణంగా అతను బ్రిటిషువారితో స్వయంగా తగాదాకు దిగడం అనూహ్యం, కంపెనీ ఉద్యోగులెవరు గూడ యుద్ధము అవసరమని భావించలేదు. వెల్లస్లీ యుద్ధాన్ని గూర్చి మొదటి ప్రస్తావించగా, మద్రాసు గవర్నరు లార్డు క్లైవు దానిని వ్యతిరేకించి, కనీసం వాయిదా వేయమని కోరుతూ ఒక సుదీర్ఘ విజ్ఞప్తిని సమర్పించాడు. యుద్ధం నిజానికి ఆత్మరక్షణకై ఉద్దేశించబడిన అది కంపెనీ ఉద్యోగులందరినుంచి ఏకగ్రీవ అమోదముద్ర పొంది వుండేది.

అందుచేత యుద్ధానికి ప్రధానకారణం భారతదేశంలో బ్రిటిషు అధికారాన్ని వ్యాప్తిచేయాలనే కారన్‌వాలీస్ గాఢ ఆకాంక్ష విజయవంతమైన ఒక యుద్ధం మూలాన కంపెనీకి అనేక లాభాలు కలుగుతాయి. అపజయము పొందిన మాత్రాన మాతృ దేశ ప్రభుత్వము హర్షించదు. అందువల్ల అపజయము పొందకుండా వుండేందు కు. వెల్లస్లీ ఖచ్చితమైన పథకాలను ముందుజాగ్రత్తతో రూపొందించేందుకు ఎట్టిఅ వసరములేదు. ఐరోపాలో నెల్సన్ విజయాలు హైదరాబాదులో ఫ్రెంచి సైన్యాల ఉపసంహరణ, జామన్షా వెనుతిరిగి వెళ్ళటం, టిప్పు సహకరించే ఉద్దేశము కన పరచటం ఇలాంటివి యుద్ధానికి వెంటనే కారణాలుగా తోచవు. ఫ్రెంచివారు మైసూరు నుంచి పూర్తిగా తొలగించబడిన, బ్రిటిషు రెసిడెంటుని స్వీకరించిన, కెనరతోబాటు గల తీర ప్రాంతాన్ని ఇతర బ్రిటిషు మండలాలతో మార్పిడిచేసుకోవడానికి టిప్పు అంగీకరించినట్లయితే వెల్లస్లీ ఇతనితో తగాదాలు పరిష్కరించుకోవడానికి మొదట సుముఖంగానే వున్నాడు. కాని క్రమంగా తన యుద్ధయంత్రాంగాన్ని సన్నద్ధం చేయడానికి వేసిన ప్రతి అడుగుతో టిప్పు పట్ల షరతులు విధించచంలో మరీ

కారిన్యత కనపరిచాడు. న్యాయమైన కోర్కెలను అంగీకరించడానికి టిప్పు వ్యతిరేకంగా లేడు. అట్టివాని మూలంగా తన మనుగడికి ముప్పుగూడ వాటిల్లదు. కానీ టిప్పు రాజ్యంలో అత్యంత భాగం బ్రిటిషువారికి అప్పజెప్పినట్లయితే సంప్రదింపులకు సిద్ధంగా లేడు వెల్లస్లీ. తన భావాల్ని కనీసం తెలయజేయడానికి గూడ అవకాశం కల్పించడం జరగలేదు.

యుద్ధానికి ప్రధానకారణంగా భావించబడిన మాలర్టిక్ ప్రకటనని వెల్లస్లీ మద్రాసులోని జనరల్ హారిస్‌కు పంపి, టిప్పుతో యుద్ధం బహుశా తప్పదని సూచించాడు. మొదట వెల్లస్లీ గూడ యీ ప్రకటన, నిజానిజాలు గురించి అనుమానపడ్డాడు. ఇది బహుశా మైసూరుతో బ్రిటిషువారి సంబంధాలను తెంచే దురుద్దేశంతో కల్పించబడిన నకిలీ ప్రకటన అని గూడ తలపోశాడు. కానీ వెంటనే వెల్లస్లీ తన దృష్టిని మార్చుకొన్నాడు. టిప్పు దీనికి బాధ్యుడని అతని నిర్ణయించుకున్నాడు. అయినప్పటికి, టిప్పుని మభ్యపెట్టి తాను నిరపాయస్థితిలో వున్నానని నమ్మించడానికై జనరల్ హారిస్‌కు వ్రాసిన కేవలం ఐదు రోజులలోగా టిప్పుకి వైనాడ్, కూర్గు ప్రాంతాలను ప్రస్తావిస్తూ జాబు వ్రాశాడు. ఈ తగాదాని పరిష్కరించడానికై ఇరుపక్షాలకి సంబంధించిన కమీషనర్లను నియమించాలని, ఆ కమీషనర్ల నిర్ణయాలు తు.చ. తప్పకుండా అంగీకరిస్తామని వెల్లస్లీ టిప్పుకి అభయమిచ్చాడు. 1798 జూన్ 20 వ తేదీన వెల్లస్లీ యుద్ధ నిర్ణయం చేశాడు. యుద్ధము యొక్క తక్షణ ఉద్దేశము ప్రకారము టిప్పు తీరమండలాలని ఆక్రమించుకొని అతన్ని దిగ్బంధము చేసిన టిప్పు ముఖ్యనగరమైన శ్రీరంగపట్టణంపైకి నడవడం, ఇది కాక వెల్లస్లీ, టిప్పునుంచి యుద్ధఖర్చుల క్రింద పెద్ద మొత్తాన్ని రాబట్ట దలచాడు గూడ. ఎంత ధనమన్నదీ టిప్పుతో సంప్రదించి నిర్ణయించదలచాడు. టిప్పు ఆస్థానంలో ఒక బ్రిటిషు రెసిడెంటుని నిర్బంధంగానైనా నియమించ దలచాడు. టిప్పు కొలువులో ఏ ఒక్క ఫ్రెంచి జాతీయుడు గూడ ఉండకూడదన్నది వెల్లస్లీ వాంఛ. వెల్లస్లీ ప్రకటన నకళ్ళని పూనాకి, హైదరాబాదుకి పంపి, వారి సహాయాన్ని గూడ అర్థించాడు.

వెల్లస్లీ వెంటనే టిప్పుపై దెబ్బతీయలేకపోయాడు. కంపెనీ యొక్క సైనిక, సివిల్ వ్యవహారాలన్నిటినీ ఎంతో త్వరితంగా పునర్వ్యవస్థీకరింప జేయవలసి వుంది. అంతే కాకుండా హైదరాబాదులో ఫ్రెంచి సైన్యాలుండటం, పూనాలో అస్తవ్యస్తమైన పరిస్థితులు, ఆహారధాన్యాల కొరత, దిగజారిన ధనపు నిలవలు, వీటితోబాటు టిప్పుకి గల మేలైన ఆశ్విక దళము, వెల్లస్లీ యుద్ధాన్ని కొన్ని నెలల

బాటు ఉపేక్షించడానికి కారణాలయ్యాయి. ఇంతలో వెల్లస్లీ యుద్ధానికి సిద్ధపడు తూ, "అతి శక్తివంతమైన సైన్యాన్ని అతి కొద్ది సమయంలో" సమీకరించమని మద్రాసుకు వర్తమానం పంపాడు. నిజాం వైపు దృష్టి మళ్ళించి, అక్కడి ఫ్రెంచి సైన్యాన్ని తొలగించి, దాని స్థానే ఒక బ్రిటిషు సైన్యాన్ని నిలిపేందుకు అంగీక రించమని ఒత్తిడితెచ్చాడు. తర్వాత ప్రవేశపెట్టబడిన సైన్య సహకార పద్ధతికి రూపకల్పన చేస్తున్న సమయమది. ఈ సైన్యసహకార సంధి మొట్ట మొదట నిజాంతోనే కుదిరింది గూడ. సుమారు 14,000 సైన్యానికి నాయకత్వం వహిం చిన ఫ్రెంచి సేనాని రేమాండ్ మరణించాడు దీనితో నిజాం స్వాతంత్ర్యాన్ని హరించే విధంగా అతనితో సంధి చేసుకోవడం వెల్లస్లీకి మరీ సులభమైంది. స్వయంగా బ్రిటిషువారికి ఉపగ్రహంగా ఉండడానికి అతను స్వయంగా అంగీక రించాడు. ఈ సంధి 1798 సెప్టెంబరు 1 వ తేదీన కుదిరింది. ఫ్రెంచి సైన్యం తొలగించబడి, దాని స్థానే, కల్నల్ రాబర్ట్స్ నాయకత్వంలో 6,000 బ్రిటిషు సేనలు నిజాం సైనిక బాధ్యతలు స్వీకరించాయి. ఆ విధంగా వెల్లస్లీ ఎంతో చాక చక్యంతో తన తెలివితేటల్ని ఉపయోగించి, ఫ్రెంచి సైన్యాలని రద్దుపరచి, నిజాంని టిప్పుకి వ్యతిరేకంగా తన పక్షానికి రాబట్టుకోవటం ఒకే సమయంలో సాధించా డు. కాని అదే సమయంలో మహారాష్ట్రులను గూడ తన వైపు త్రిప్పుకొనలేక పోయాడు. నిజాం వలె సంధికి అంగీకరించమని పీష్వాపై ఒత్తిడి జరిపింది. జామన్‌షా ఆక్రమణ భీతికి లోనైన సింధియాని ఢిల్లీ చేరుకోవలసిందిగా గూడ కోరారు. సైనిక లాభ దృష్టితో గాక కనీసం ఉత్తరోత్తరా రాజకీయ అనర్థాలు నిరో ధించడానికైనా మహారాష్ట్రులతో ఒప్పందము అవసరమైంది. మొదట పామర్ విజయము తథ్యమనుకొన్నాడు. నానా 25,000 సేనలని ఇవ్వడానికి అంగీకరిం చాడు. కానీ సింధియా పూనాలో తన పలుకుబడిని పెంపొందించుకొన్న కార ణంగా తన వాగ్దానాన్ని ఉపసంహరించుకొమ్మనీ నానాని కోరాడు. మహారాష్ట్రుల పూర్తి సహాయాన్ని వెల్లస్లీ పొందకపోయినా, వారి తాటస్థ్యము గూడ మిక్కిలి ప్రధానమైనదే. పూనా బ్రిటిషువారికి పూర్తి మద్ధతును అందజేయకుండా వుండేం దుకు టిప్పు అనుసరించిన దౌత్య విధానము గూడ కొంత కారణం. ఒక సమ యంలో బాజీరావు, సింధియా, టిప్పు ఒకరికొరకు బ్రిటిషువారికి వ్యతిరేకంగా సహాయము చేసుకునేటట్లు ఒక పథకాన్ని తయారుచేశారు. ఈ పథకం ప్రకారం మహారాష్ట్రులు మొదట నిజాంని ఎదుర్కొంటారు. బ్రిటిషువారు సైన్యసహకార పద్ధతి ప్రకారం నిజాంకి సహాయానికై వెళితే అది బ్రిటిషువారిపై సంఘటితంగా

దాడిచేయడానికి సంకేతమవుతుంది. కాని యీ పథకాలన్నీ, వెల్లస్లీ మైసూరుపై మెరుపులాగా అతివేగంగా సాగించిన దండయాత్ర ముందు పనిచేయలేదు.

సైనిక దౌత్య ప్రయత్నాలని ముగించుకొని వెల్లస్లీ టిప్పుపై దృష్టి మళ్ళించాడు. కమిషనర్లు పరిశీలించడానికి గూడ ముందే వైనాడ్‌ని టిప్పుకి అప్పచెప్పాడు. ఇది కేవలం అతని ఎత్తుగడలని కప్పిపుచ్చడానికి మాత్రమే. ఈ సమయంలో ఎప్పుడూ ఒకసారిగూడ టిప్పు మారిషస్ దీవికి రాయబారం పంపటం బ్రిటిషువారికి ఆగ్రహం కలిగించిందనే విషయం ప్రస్తావించబడలేదు. 1798 నవంబరులో మాత్రమే యీ విషయం ప్రస్తావించబడి, అటువంటి సంబంధాల మూలంగా తన అవసరాలు విపరీత పరిణామాలకు తారితీస్తాయని టిప్పు హెచ్చరించబడ్డాడు. మేజర్ డోవిటన్ మూలంగా బ్రిటిషువారు తెలియజేసే షరతుల్ని టిప్పు బేషరతుగా అంగీకరించాలని వెల్లస్లీ కోరాడు. సైన్యసహకారపద్ధతి సంధిలోని షరతులన్నీ టిప్పుకి ఆదేశించాడు. టిప్పు వాటిని అంగీకరించనవట్లయితే తన స్వాతంత్ర్యానికి తిలోదకాలివ్వాలని త్రోసిపుచ్చాడు. ఈ సంధిపై సంతకం చేయడమే కాక తీరమండలాలని టిప్పు ఇచ్చి వేయాలని ఆశించాడు వెల్లస్లీ. మారిషస్ దీవికి రాయబారం పంపడం యిప్పుడు ప్రధానసమస్యకాదుగాని, తన అధికార క్షయానికి తానే లొంగడం అసలు విషయం.

తన చుట్టూ జరుగుతున్న విషయాలన్నీ టిప్పుకి బాగా ఎరుకే. మంగళూరుకి అతి శక్తివంతమైన నౌకాదళము పంపబడింది. నిజాం సైన్య సహకార సంధిపై అంగీకారానికి వచ్చి తనకి వ్యతిరేకంగా బ్రిటిషువారి పక్షం వహించడం, యుద్ధానికి పెద్దఎత్తు జరుగుతున్న ప్రయత్నాలు అన్నీ తెలిసినా తానుగా రెచ్చగొట్టకపోయినట్లయితే బ్రిటిషువారు తన దండయాత్ర చేయరని తలచాడు. పరిస్థితి విషమించిన తరువాత టిప్పు ఒక ఉత్తరం వ్రాస్తూ తన శాంతికాముక ఉద్దేశాలని ఎరుకపరచి, డోవిటన్‌ని ఆహ్వానించడానికి వ్యతిరేకత తెలియజేశాడు. అంగీకరించినట్లయితే క్రొత్త త్యాగాలతో కూడిన సరిక్రొత్త సంధి కుదుర్చుకొన్నట్లవుతుందని టిప్పుకి తెలుసు. అలాంటిది అప్పుడప్పుడే నిజాంతో కుదుర్చుకొని, అతని స్వాతంత్ర్యాన్ని హరించివేసిన ఒప్పందానికి అట్టే వ్యత్యాసముండదు. తన సూచనలని టిప్పు త్రోసి పుచ్చాడని తెలిసిన వెల్లస్లీ ఉగ్రుడయ్యాడు. వెటనే అతను 1798 డిసెంబరులో యుద్ధ ప్రయత్నాలని స్వయంగా పర్యవేక్షించడానికై మద్రాసు చేరుకొన్నాడు. 1799 జనవరి 9 వ తేదీన టిప్పుకి వ్రాసిన ఒక లేఖలో వెల్లస్లీ బ్రిటిషువారిని ఓడించడానికై అతననేక ఆసియా దేశా

లతో రహస్య ఆలోచనలు చేస్తున్నట్టు నిందించాడు. లేఖలో బాగా దురుసైన భాషని ఉపయోగించాడు. డోవిటన్‌ని ఆహ్వానించమని మళ్ళీ కోరాడు. బదులివ్వడానికి తన అంగీకారాన్ని టిప్పు తెలియజేసాడు. కాని తన జాబు మద్రాసు చేరేటప్పటికి వెల్లస్లీ మైసూరు జయించడానికి నిర్ణయించాడు. 1799 ఫిబ్రవరి 3 వ తేదీన జనరల్ హారిస్ మద్రాసు నుంచి బయలుదేరాడు. టిప్పు సంప్రదింపులు ప్రారంభించిన, హారిస్‌కు రాజకీయ విషయాలపై సలహాలనివ్వడానికై ఒక కమిషన్ నియమించబడింది. శ్రీరంగ పట్టణాన్ని ముట్టడించడానికి సహాయపడడానికై జనరల్ స్టూవర్ట్ నాయకత్వం క్రింద బొంబాయి సైన్యాలు మలబారు నుంచి తరలి రావాలి. శ్రీరంగపట్టణాన్ని ముట్టడించడానికి ప్రారంభమయేంతవరకు లేదా మరియొక కీలక ప్రాంతాన్ని ఆక్రమించేంతవరకు శాంతి ఒప్పందాన్ని సూచించకూడదని హారిస్ రహ్యంగా నిర్దేశించబడ్డాడు. రెండు విధాలైన షరతులుగల క్రొత్తసంధి వ్రాయబడింది. కొంత సుళువైన షరతులు గల మొదటి ప్రతి శ్రీరంగ పట్టణాన్ని ముట్టడించకముందు టిప్పు శాంతి సమావేశానికి అంగీకరిస్తేనే అనుసరింపబడాలి. ముట్టడి తర్వాత అతను అంగీకరిస్తే చాలా కఠినమైన షరతులతో కూడుకొన్న రెండవ ప్రతి అనుసరించబడుతుంది. మొదటి ప్రతి ప్రకారము తీరప్రాంతాన్ని అప్పజెప్పి, 1 ½ కోట్ల రూపాయలు చెల్లించి, తన కుమారులతో ముగ్గురు పెద్దవారిని జామీనులుగా పంపాలి. రెండవప్రతి దీని కన్నకఠినమైనది. టిప్పు రాజ్యంలో సగభాగము అప్పజెప్పాలని, నష్టపరిహారం క్రింద రెండుకోట్ల రూపాయలు చెల్లించాలని అది నిర్దేశించింది.

బ్రిటిషు సైన్యము ఫిబ్రవరి 11 వ తేదీన వెల్లూరు నుంచి బయలుదేరింది. 4,000 ఐరోపియనులతో 20,000 సిపాయిలతో కూడిన ఈ సైన్యం అంతవరకు ఏపోరాటములోను పాల్గొననంత అతి పెద్ద బ్రిటిషుసైన్యం. నిజాం మరియొక 16,000 మంది సైనికులను తెచ్చాడు. బొంబాయి సైన్యము 6,000 సైనికులతో కూడినది. దక్షిణంనుంచి మరియొక 5,000 సైన్యాలు కల్నల్ రీడ్, కల్నల్ బ్రౌనేల నాయకత్వం క్రింద కదలి వచ్చింది. కంపెనీసైన్యము మాత్రం 35,000 మందికి మించింది. మూడవ మైసూరుయుద్ధ అనుభము ఈసారి ఎంతో ఉపయోగపడింది. బొంబాయి, మద్రాసు సైన్యాల రాకను అరికట్టడానికి టిప్పు ప్రయత్నించాడు. కానీ అతని ప్రయత్నాలు ఫలించలేదు. 1791 లో కారన్‌వాలీసు అనుసరించిన మార్గాన్ని హారిస్ అనుసరించక, శ్రీరంగ పట్టణానికి తూర్పున 15 మైళ్లలో గల సోసిల్లిని దాటి ఏప్రిల్ 5 న ముట్టడి ప్రారంభించాడు. ఏప్రిల్ 20 న టిప్పు

శాంతికై సంప్రదించడానికి ఇష్టపడుతున్నట్లు తెలియజేశాడు. హారిస్ అప్పటికే తయారుచేసిన రెండవ ప్రతిని పంపి 24 గంటల వ్యవధి మాత్రం యిచ్చాడు. టిప్పు అలాంటి కఠినషరతులు నిరాకరించాడు. ఏప్రిల్ 25 న నాలుగు ఫిరంగులతో కూడిన బ్రిటిషు పటాలము రక్షణ నిర్మాణములను ధ్వంసం చేయడానికై కాల్పులు ప్రారంభించింది. టిప్పు మొదటిశ్రేణి సైన్యాలు ఎదిరించబడ్డాయి. అతి శక్తివంతంగా ప్రతిఘటించబడినా ముట్టడి కొనసాగింది. ఏప్రిల్ 28 న మళ్ళీ టిప్పు సంప్రదింపులకి ప్రయత్నించాడు. కానీ హారిస్ రెండవ పత్రంలోని కోరికలని అంగీకరించడానికి అతి తక్కువ వ్యవధినిచ్చాడు. ఇది పరిష్కారమవుతుందన్న ఆశలని వమ్ముచేసింది. బ్రిటిషువారిపై ఆధారపడుతూ వారిచ్చేభత్యం పుచ్చుకొని జీవితాన్ని గడపడంకన్నా, సైనికుడుగా గౌరవప్రదంగా మరణించడానికి నిర్ణంచికొన్నాడు, టిప్పు. అతనికి అనేక అడ్డంకులు ఎదురయ్యాయి. టిప్పు పట్ల కొంత నమ్మకద్రోహం కూడ జరిగిందని చెప్పడానికి ఆధారాలు లేకపోలేదు. అసంతృప్తిపరులైన కొందరు టిప్పు మంత్రులు, బ్రిటిషువారికి అనుకూలంగా మారిపోయారు. మీర్ సాదిక్ అనే మంత్రికి మే నెల 4 వ తేదీన ముట్టడి జరుగుతుందనే విషయం తెలుసు. సైనికులకి జీతాలు చెల్లించాలనే నెపంతో అతను కోటకి గండిపడిన ప్రాంతంలోని సేనలని ఉపసంహరింపజేశాడు. టిప్పు పతనానంతరం గుఱ్ఱంకొండనవాబుగా కుమరుద్దీన్ ఖాన్ నియామకం అనేక అనుమానాలని కలిగించక మానదు. టిప్పు సేనలలో వున్న మరి ఏ మహమ్మదీయుడు గూడ యుద్ధం తర్వాత బ్రిటిషువారిచే అంత ఘనంగా ఆదరింపబడలేదు. ముట్టడి మధ్యాహ్నము 1 గంటకు ప్రారంభమైంది. టిప్పు యుద్ధంలో పోరాడుతూ మరణించాడు.

భారత విముక్తి కృషిలో టిప్పు వీరమరణాన్ని ఆహ్వానించాడు. నీతి నియమాలులేని అత్యాశాపరులైన విదేశీయులబారినుంచి దేశాన్ని రక్షించడంలో తన ప్రాణాన్ని పణంగా పెట్టాడు. బ్రిటిషవారిని నిర్విరామంగా ధైర్యంగా మరే ఇతర భారతదేశ రాజు ఎదిరించనంతగా అతను ఎదిరించాడు. మన దేశంలో బ్రిటిషువారి రాజ్యవిస్తరణకి గల అడ్డంకులు అతని మరణంతో తొలగిపోయాయి. శ్రీరంగపట్టణాన్ని వారు భారతదేశాన్ని కూకటివ్రేళ్ళతో కదిలించడానికి పట్టుకొమ్మని భావించి దానిని ఆక్రమించే సమయంలో సంతోషంతో "భారతదేశం ఇక మనది" అని నినాదాలు చేసారు. భారతదేశంలో బ్రిటిషు అధికారము గాఢంగా వేళ్లూనింది. భారదేశంలోని బ్రిటిషుసామ్రాజ్య చరిత్రలో నాలుగవ మైసూరుయుద్ధము పెద్ద

మైలురాయి. కోరమండల్ నుంచి మలబారు వరకు అనగా తూర్పు, పశ్చిమ తీరాల మధ్య తమ ప్రాంతాలను కలిసేటట్లుచేసింది. అది తమ ప్రబల శత్రువుని నాశనముచేసి తమ ఆర్థిక నిధులని మెరగుపరచాయి. అతని భవిష్యత్తుని ఎలా నిర్ణయించాలనే బ్రిటిషువారి మీమాంసకు అతని మరణము ఆస్కారమివ్వలేదు. బ్రిటిషువారిని ఎదిరించాలనే నిర్ణయాన్ని తమ ప్రధాన పథకంగా భావించిన, హైదరాలీ టిప్పు వంశము ఈ యుద్ధంలో అంతమైంది.

టిప్పు పతనానంతరం విజేతలు అనేక క్లిష్ట సమస్యలని ఎదుర్కొన్నారు. ఒక వైపు అట్టి విశాలమైన ధనవంతుమైన రాజ్యాన్ని ఆక్రమించుకోవడంలో గల కాంక్ష ఇతర రాజ్యాల యీర్ష్య అట్టి పరిస్థితిలలో తథ్యమైనందువల్ల కలిగే అవకతవకలు మరొక వైపు వుండనే వున్నాయి. అందుచేత రాజ్యాన్ని విభజించడము మాత్రమే సమస్య పరిష్కారంగా తోచింది. భారత రాజవంశము పునరుద్ధరించబడాలి. నిజాంకు సమానభాగం ఇచ్చినట్లయిన అతను మరీ బలవంతుడవుతాడని ఇవ్వబడలేదు. తమ పేరుప్రతిష్టలు పోయాయని తమ తండ్రి దుర్మరణము చెందాడని విదేశీయులకి దాసోహమవడం ఇష్టంలేక టిప్పు కుమారులు భవిష్యత్తులో ఎక్కడ సమస్యలు సృష్టిస్తారో అని వారందరినీ పూర్తిగా తొలగించారు. అయితే పాత భారతవంశాన్ని పునః ప్రతిష్ఠించడంవల్ల బ్రిటిషువారికి అనేక సదుపాయాలు కలుగుతాయి. తమ రాకకు బ్రిటిషువారు బాధ్యులై నందువల్ల వారికి తప్పక విధేయులై వుంటారు. మైసూరులో అన్ని విషయాలు సంక్రమంగా నడపడానికి ఒక కమిషన్ స్థాపించబడింది. జనరల్ హారిస్, కల్నల్ వెల్లస్లీ, హెన్రీ వెల్లస్లీ, లెఫ్టినెంట్ కల్నల్ కిర్క్ పాట్రిక్, లెఫ్టినెంట్ కల్నల్ బారిక్లోస్ అందులో సభ్యులు. రెండు ఒడంబడికలు కుదిరాయి. ఒకటి కంపెనీకి నిజాంకి మధ్య మరొకటి కంపెనీకి మైసూరు రాజుకి మధ్య 39.5 లక్షల ఆదాయాన్నివ్వగల ప్రాంతంలో 6.9 లక్షల పగోడాల ఆదాయాన్నిచ్చే ఆరింట ఒక భాగాన్ని కంపెనీ ప్రభుత్వము తీసుకొన్నది. నిజాంకి ఇందులో చాలా కొద్ది మాత్రం లభించింది. రాజాకి 13.5 లక్షల విలువైన భూభాగం ఇవ్వబడింది. మహారాష్ట్రులు బ్రిటిషువారితో చేరేందుకు సుముఖంగా వున్నట్లయితే వారికై 2.6 లక్షల మతింపుగల చిన్న ప్రాంతాన్ని ప్రత్యేకించారు. కోటని ముట్టడించింది బ్రిటిషువారు కాబట్టి టిప్పు ఖజానాలోని ధనమంతా వారికే చెందుతుందని తెలియజేశారు. విభజనలో అనుసరించిన పద్ధతిపై నిజాం అసంతృప్తి చెందాడు. మైసూరు రాజ్యంపై సర్వాధికారాన్ని వహించడంలో కంపెనీ ప్రభుత్వానికి తప్ప మరెవ్వరికీ ఎట్టి అవకాశమూ లేదు.

బ్రిటిషువారిని నిర్విరామంగా ఎదిరించాలనే దృఢమైన పద్ధతిపట్ల టిప్పుకి గల గాఢ విశ్వాసము వల్ల అతని పరిపాలనా కాలానికి అత్యంత ప్రాముఖ్యముంది. ఈ అభిలాష సిద్ధికై అతను తన సర్వశక్తిని వినియోగించి తన నిల్వలన్నిటినీ వెచ్చించీ, చుట్టుపట్ల రాజులతో సంధి ఒడంబడికలు చేసుకుని చివరికి విదేశాల సహాయాన్ని అర్థించి గట్టి కృషి చేశాడు. నూరేండ్ల నక్కలా బ్రతకడం కన్న ఒక్క రోజైయైనా సింహంవలె జీవించడమే ఉత్తమని అతని దృఢనమ్మకం. స్వాతంత్ర్యాన్ని అతను గాఢంగా అభిలషించాడు. బ్రిటిషువారు అంతకు ముందు అతనికన్న బలమైన శత్రువును ఎదుర్కొనలేదు. టిప్పు అవమానానికి బదులు మరణాన్ని కోరుకొన్నాడు.

# 8

## పాలనా విధానము

తన రాజ్యపు పరిపాలనా విధానములో టిప్పు ఎంతో ఆసక్తి తీసుకొన్నాడు. నిర్వి రామంగా తలపోయడంలో, ఉత్సాహంతో పని చేయడంలో అతను దిట్ట. సర్వఅ ధికారాలని పూర్తిగా కేంద్రీకృతముచేసిన తన చేతులలో వుంచుకోవాలని అతని ఆశయం. అత్యంత సామర్థ్యము గల కొద్ది మంది పాలకులలో అతనొకడు. అతని అధికారులతో గల విపరీతమైన ఉత్తర ప్రత్యుత్తరాలు అతనికి పరిపాలనా విధా నము పట్ల గల ఆసక్తిని తెలియజేస్తాయి. సాధారణ పాలన, సైన్యము, వాణి జ్యము వంటి దాదాపు అన్ని అంశములపై వారికి మిక్కిలి విశదమయే సూచనలని పంపువాడు. క్రొత్త వాటిని ప్రవేశపెట్టడంలో ఉన్నవాటిని మెరుగు పరచడంలో అతనికి అత్యంత ఆసక్తి తన పరిపాలనా యంత్రాంగంలో మైలైన పాశ్చాత్య పద్ధ తులని ప్రవేశపెట్టాడానికి అతనెప్పుడూ వెనుకాడ లేదు. తాను సైన్యాన్ని పూర్తిగా పునర్వ్యవస్థీకరించుట, నౌకా విషయముల పరిశీలించడానికి ఏర్పరచిన ప్రత్యేక కమిటీ, క్రొత్త నాణెములను విడుదలజేయుట, మత్తుపానీయాల విక్రయాన్ని నిషే దించడం, కాలండరుని సంస్కరించడం, తూనికలు కొలతలలో తెచ్చిన మార్పు లు, వాణిజ్య విధానములో చేసిన అద్భుత ప్రయోగాలు, భూమిశిస్తు న్యాయపరి పాలన విషయాలలో క్రొత్త అంశాలు, పట్టణాల నగరాల పేర్లు మార్పిడిలో కనబ రచిన అమితోత్సాహము అతనిలోని క్రియాత్మక చైతన్యమునకు, ఆధునీకరణపై అతనికి గల అభిమానమును వ్యక్తపరుస్తాయి. టిప్పుపై ఎక్కువ గౌరవము లేని జేమ్స్ మిల్ గూడ "అంతరంగిక పరిపాలనలో అతను ప్రాక్ దేశాలలోని అతి పెద్ద రాజులతో పోల్చదగిన వాడని" ప్రకటించడానికి వెనుకాడలేదు.

హైదర్, టిప్పుల ఆధీనంలో పరిపాలన చాలా కట్టుదిట్టంగాను, ఉన్నత ప్రమాణాలతోను కొనసాగింది. ఇద్దరూ ప్రచారంలో గల పద్ధతులని, ప్రాంతీయ ఆచారాలని, ఆయా ప్రదేశాలలోని కట్టుదిట్టాలని అనుసరించారు. హైదర్ క్రొత్తవి

కనిపెట్టడంలో ఆసక్తిచూపలేదు గాని, టిప్పు చూపాడు. ఇది అతని కేంద్రప్రభుత్వం పై మంచి ప్రభావాన్ని చూపింది. ఒడయారు పరిపాలన అనే మిధ్యను కొనసాగింప జేశాడు హైదర్. కాని టిప్పు దీనిని ఎట్టి తంతూలేకుండా తొలగించాడు. తన నాణేలపై శివుడు, పార్వతి ముద్రికలను హైదర్ కొనసాగింపజేశాడు. కానీ టిప్పు తన నాణెములు మార్పు చేయించి, మోహర్లను, రూపాయలను ప్రవేశపెట్టాడు. సుల్తాని అష్రఫితో బాటు టిప్పు మొదటిసారిగా వెండి నాణేలను గూడ విడుదల చేయించాడు.

కేంద్ర పరిపాలనా వ్యవస్థ 18 శాఖలను కలిగింది. సివిల్ వ్యవహారములలో ఆర్థిక శాఖ, పోలీసు విభాగము, అతి ప్రధానమైనవి. పోలీసు శాఖ నిఘావిషయాలతో బాటు తపాలా కార్యాలయాన్ని గూడ పర్యవేక్షించింది. టిప్పు సర్వ అధికారాలను తనలో కేంద్రీకృతంచేశాడు. తన రాజ్యంలో అత్యంత ఉన్నత శాసనాధికారాలు, న్యాయ కార్యనిర్వాహకాధికారలు అతనికే వుండేవి. అతనే అతనకి ప్రధాన మంత్రి, విదేశాంగమంత్రి, సేనా నాయకుడు, ఉత్తర ప్రత్యుత్తరాలను తానే స్వయంగా వ్రాయించేవాడు. తన ప్రజల క్షేమాలను పెంపొందించే ఆసక్తితో టిప్పు ఒక సాంఘికసంస్క ర్త పాత్రను నిర్విహించాడు. మద్యనిషేధాన్ని అమలుపరచాడు. వ్యభిచారమును అరికట్టి, మలబారు ప్రాంతంలో బహుళ ప్రచారములో వున్న బహు భర్తుత్వమును అరికట్టాడు. మలబారు ప్రాంతంలో స్త్రీలు నడుము పైభాగాన్ని ఆచ్ఛాదితరహితంగా ఉంచుకొనేవారు. అందుకై టిప్పు స్త్రీలందరు సరిగా తమ దైహాలని దుస్తులతో కప్పుకొనేటట్లు శాసించాడు. అతను వర్తకుని, ఉత్పత్తి దారుని, పెట్టుబడిదారుని, ధనపు మార్పిడిదారుని-అందరి సూచనలు పంపేవాడు. తన ప్రాంతీయ, మండలాధి కారులకు విశదమైన సూచనలు పంపేవాడు. హైదర్ టిప్పు ఆధీనములో హిందువులు వారి చట్టముల పరిధిలోనే పాలింపబడ్డారు. వాటితో టిప్పు జోక్యము కలిగించుకొనేవాడు కాదు. వారిద్దరూ ప్రజలకి మత పద్దతులలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించారు. ప్రాచీనకాలంనుంచీ అమలులో వున్న పంచాయత్ పద్ధతి కుంటుబడకుండా కొనసాగింప జేసారు. వ్యవసాయము, వాణిజ్యము - వ్యాపారము, పరిశ్రములు మిక్కిలి అభివృద్ధి చెందిన టిప్పు రాజ్యములోని ప్రజల జీవన విధానములో ఎంతో సంతృప్తి కనిపించిందని మూర్ అనే చరిత్రకారుడు వ్రాశాడు. మొగలాయిల నుంచి, ఆంగ్లేయుల నుంచి. ఫ్రెంచి వారినుంచి అరువు తెచ్చుకొన్న విధానాలపై సొంత మార్పులు కూర్పులు చేసి కేంద్ర ప్రభుత్వ యంత్రాంగములో అనేక మార్పులు

తెచ్చాడు. అతను మొత్తం శాఖలని 18 నుంచి 7 కు తగ్గించాడు. ప్రతి శాఖకు ఒక ప్రధాన అధికారి వుండేవాడు. అతను తన ఉద్దేశాలను ఒక ప్రత్యేక పుస్తకములో తన సంతకంతోబాటు వ్రాసి ప్రభుత్వ ముద్రిక గల పెట్టెలో భద్రపరచాలి. ఎప్పుడైనా టిప్పు తన సలహాదారుని పిలిచి వారి ఉద్దేశాలని కోరినట్లయితే మొదట వారిలోవారు సంప్రదించుకుని తర్వాత వారి ఉద్దేశాలని టిప్పుకి తెలియజేయాలి. ప్రభుత్వములోని ఏడు శాఖలు ఇవి: రివెన్యూ, ఆర్థికశాఖ, సైన్యము, ఆయుధములు వాటి తయారీ, నౌకా విషయములు ఖజానా మరియు టంకశాల, వాణిజ్యము, దానితోబాటు జుమ్రా అనే ఒక ప్రత్యేక సైన్యము.

హైదర్ అధికారంలో వున్నపుడు రాష్ట్రపాలకులు కొద్దిమంది మాత్రమే. బిద్నూరు, మలబారు చాలా ప్రధానమైన రెండు మండలాలు. టిప్పు మొదట తన రాజ్యాన్ని ఏడు రాష్ట్రాలుగా విభజించాడు. తర్వాత వాటిని తొమ్మిదికి పెంచాడు. చివరికి పదిహేడుగా చేశాడు. 1794 నాటికి మొత్తం రాష్ట్రాలు 37 కు పెరిగాయి. అందు 1,024 అమిల్‌దారులు నియమించబడ్డారు. ప్రతి రాష్ట్రానికి ఒక సివిల్ గవర్నరు (అసిఫ్) ఒక సైనిక గవర్నరు (ఫౌజ్‌దార్) నియమింపబడ్డారు. అసిఫ్ రేవిన్యూ వ్యవహారాలని ఫౌజ్‌దార్ శాంతి భద్రతలను గమనించారు. ఇట్టి అధికార విభజన మూలంగా నిజాయితీ పరిరక్షణ పాలనావ్యవస్థలో అంతర్భాగంగా రూపొందించారు. అసిఫ్‌లకు శిరస్తాదారులు, గుమస్తాలు, సేవకులు ఉండేవారు. గ్రామాలు పటేలు, షన్‌బోగ్‌ల ఆధీనంలో వుండేవి. పటేలు రహదారులు చెట్లు మొదలైన వాటిని గమనించటమేకాక గ్రామాలలో తగాదాలు పరిష్కరించటం, అక్కడి శాంతి భద్రతలకి గూడ బాధ్యత వహించాడు. శ్రీరంగపట్నం నుంచి సాధారణంగా మూడు భాషలలో ఉత్తరువులు జారీ అయేవి. అవి-పారశీకము, కన్నడ, మరాటీ, సివిల్ ప్రభుత్వపు అత్యంత ప్రధాన కృషి శిస్తు వసూలు చేయడము, వసూలు చేసిన ధనాన్ని ఇతర శాఖలకు కేటాయించడము, శిస్తు వసూలుకి అమీల్‌దారులు బాధ్యత వహించారు. హైదర్ విశాల మండలాలని వారికి నిర్ణయించిన మొత్తాలకు అప్పజెప్పేవాడు. వారు క్రమం తప్పక రుసుము చెల్లించాలి. ప్రతి గ్రామము పటేలు ఆధీనంలో ఒక ప్రత్యేక గణతంత్ర విభాగంగా వుండేది. టిప్పు సింహాసనానికి రాకముందు విశాల ప్రాంతాలపై అజమాయిషీ కలిగి వున్న కారణంగా శిస్తు విధాన పద్ధతులలో అతను విశేష అనుభవాన్ని గడించాడు. భూ అమరిక విధానంలో ముఖ్యాంశము కౌలుదారు, తన వంశీకులు వ్యవసాయం కొనసాగిస్తూ శిస్తు క్రమంతప్పక చెల్లిస్తున్నంతకాలం భూమి తమ

ఆధీనములోనే కొనసాగుతుంది. మెట్ల భూముల ఫలసాయంతో మూడింట ఒక భాగము, చెరువులు, నదుల మూలంగా నీరు పొంది, పల్లపు భూములలో పైరైన పంటపై అర్ధభాగము భూమి శిస్తుగా వసూలు చేయబడాలి. టిప్పు వ్యవసాయాన్ని విస్తృత పరచాలనే ఉద్దేశంతో అనేక బీడు భూములని మొదటి సంవత్సరం పూర్తిగా శిస్తు మినహాయింపు తోను, రెండవ సంవత్సరం నాలుగింట ఒక వంతుతోను, మూడవ సంవత్సర నుంచి మామూలు శిస్తుతో వ్యవసాయాన్ని కొనసాగింప జేశాడు. చెరకు, గోధుమ బార్లీ పంటలు పండించడానికి చాలా ప్రోత్సాహమిచ్చాడు.

హైదర్, టిప్పులు రాకముందు మైసూరులో చెప్పుకోవడానికి ఒక్క రేవు గూడ లేదు. హైదర్ 1764 లో మొట్ట మొదటి రేవుని సంపాదించాడు. కానీ అతను అనేక యుద్ధాల్లో సతమతమై వున్న కారణంగా వాణిజ్యాన్ని అట్టే అభివృద్ధి చేయలేదు. కానీ టిప్పు వర్తక వాణిజ్యాలలో అత్యధిక ఆసక్తిని తీసుకుని మిరియాలు, మిర్చి, గంధము, ఏలకులు, బియ్యం మొదలైనవాటి ఎగుమతులను ప్రోత్సహించాడు. బెంగుళూరు ఒక గొప్ప వర్తక కేంద్రం. దాదాపు 200 ఎద్దులపైన సరకులు మైసూరు సరిహద్దు గుండా కేరళకు, ప్రతిరోజూ వెళ్ళేవి. సోంద ప్రాంతములోని సిరిసి ప్రత్తికీ, బాదంపప్పుకీ ప్రధాన కేంద్రము. యుద్ధాల మూలంగా టిప్పు దృష్టి కలతచెందకుండా వుంటే బహుశా మైసూరు రాజ్యంలో అతను పారిశ్రామిక విప్లవాన్ని తెచ్చి వుండేవాడు. అతను కచ్, మస్కాట్ పెగు, అర్మజ్, జిద్దా వంటి విదేశీ ప్రాంతాల్లో పరిశ్రమల కేంద్రాలని స్థాపించాడు. బాస్రా, ఎడెన్‌లలో గూడ అలాటివి స్థాపించడానికి ప్రయత్నించాడు. చైనాతో వర్తక సంబంధాలుండేవి. ఫ్రాన్సు, టర్కీ, ఇరాన్‌లతో గూడ అలాంటి సంబంధాలు స్థాపించడానికై సంప్రదింపులు కొనసాగించాడు. ఆర్మీనియా వర్తకులకి మైసూరులో స్థిరపడడానికి సంప్రదింపులు కొనసాగించాడు. ఆర్మీనియా వర్తకులకి మైసూరులో స్థిరపడడానికి ప్రోత్సాహం లభించింది. బంగారం, పొగాకు, గంధపు చెక్క, ఏలకులు, మిరియాలు కలప మొదలైనవస్తువుల వ్యాపారముపై తన ప్రభుత్వ గుత్తాధికారాన్ని స్థాపించాడు. కలప వ్యాపారానికి కళ్ళికోట ప్రధానమైన కేంద్రము. అతను వ్యాపారసంస్థనొక దానిని స్థాపించి, ప్రజలు అందులో ఆసక్తికనపడేటట్లు ప్రోత్సహించాడు. అందులో దాదాపు అయిదు వందల రూపాయల వరకు వాటాలని కొన్న వారు 50 శాతము లాభాలు పొందడానికి అర్హులు. అంతకన్న ఎక్కువ వాటాలు గలవారు తక్కువ శాతము లాభాలను మాత్రమే పొందగలరు. ఇలాంట

పద్ధతివల్ల ఎక్కువ ప్రజలు ఇందులో ఆసక్తి చూపడానికి ఆస్కారమవుతుంది. గుత్తాధిపత్యాన్ని తొలగించడానికి గూడ వీలుంటుంది. టిప్పు పరిశ్రమలని గూడ ప్రోత్సాహించి పనివారిని టర్కీ, ఫ్రాన్సు, ఇరాన్, వంటి దేశాలనుంచి ఆహ్వానించాడు. శ్రీరంగపట్నం, బెంగళూరు, బిద్నూరు, చిత్రదుర్గలలో స్థాపించిన కర్మాగారాల్లో కత్తెరలు, నీటి గడియారాలు, తుపాకులు, ఫిరంగులు, కాగితము, పింగాణి సామగ్రి వంటివి తయారు చేయబడ్డాయి. ఒక ఫ్రెంచి నిపుణుడు ఫిరంగులు మొదలైనవాటికి సులభంగా రంధ్రాలుంచడానికి పనికొచ్చే యంత్రాన్ని రూపొందించాడు. శ్రీరంగపట్నంలో ఒక కాగితపు కర్మాగారం వుండేది. తుపాకీమందు, గాజుసామానులు, ఉక్కుతీగలు, అనేక రకాలైన సంగీత సాధనాలు మైసూరులో తయారయేవి. చెన్నపట్నంలో ఒక పంచదార మిల్లు ఉండేది. నాణ్యమైన పంచదార ఉత్పత్తికి సహాయపడడానికై చైనీయులును ఆహ్వానించాడు. బెంగుళూరులోని నేతపనివారు అతి సన్నని వెండి బట్టలు నేయడంలో నిపుణులు. మస్కాట్‌లోని ముత్యాలు సేకరించే యితర నిపుణులను ఆహ్వానించి మలబారు ప్రాంతములో అట్టి సముద్రముత్యాల సేకరణ కేంద్రాలని స్థాపించడానికి ప్రయత్నించాడు. హైదర్, టిప్పు ఇద్దరూ మంచి రహదారులు నిర్మించడానికి, దుర్గాలని బలపరచడానికి, ఉద్యానవనాలు తోటలు వేయడానికి అందమైన నగరాలు నిర్మించడానికి శ్రద్ధచూపారు. దరియాదౌలత్ అని పిలిచే శ్రీరంగపట్టణంలోని వేసవి రాజప్రాసాదము, బెంగళూరులోని లాల్ భాగ్, హైదర్ సృష్టించినవి. ఆనకట్టలు నిర్మాణము చేసి నీటి పారుదల సౌకర్యాలు కలిగించడానికి అమిత శ్రద్ధ చూపడం జరిగింది. ప్రస్తుతము కృష్ణరాజసాగర్ ఆనకట్ట ఉన్న స్థలంలో టిప్పు ఒక డాము నిర్మాణానికి పథకాలు రూపొందించాడు.

మొదటి మైసూరు యుద్ధ సమయంలో (1767) హైదర్‌కి వున్నది సుమారు 30,000 సైన్యము. దీనిని రెండవ మైసూరు యుద్ధమప్పటికి (1780) 88,000 లకి పెంచాడు. హైదర్ సైన్యంలో ఐరోపియములు 1,500 వరకు వున్నారు. ఈ సైన్యాన్ని టిప్పు తన కాలంలో గూడ కొనసాగించాడు. టిప్పు మామూలు కాల్బలాన్ని 15,000 నుంచి 23,000 లకు పెంచాడు, కానీ అశ్వికదళాన్ని 1799 12,000 నుంచి 3,503 కు తగ్గించాడు. ఇది అతను అనుసరించిన సైనిక విధానపు మార్పుని సూచిస్తుంది. టిప్పు సన్యంలో అనేక మార్పులని ప్రవేశపెట్టాడు. అతని ఫిరంగిదళము అతి చక్కని స్థితిలో వుండేది. అందలి అధికార్లకు మంచి జీతాలుండేవి. ఇతర రాజ్యాలలోని సైనికుల జీత భత్యాలు, క్రమశిక్షణతో పోల్చిన

అతని సేనలు అన్ని విధాల మిన్నగా వుండేవి. అతని అశ్వికదళము ఎలాంటి ఆకలినిగాని కష్టాలనుగాని ఎదుర్కొన గలిగేవి. సైన్యానికి కావలసిన అన్ని వస్తువులని హైదర్ బయటి నుంచి తెప్పించేవాడు. కాని టిప్పు వాటన్నిటినీ మైసూరు రాజ్యంలోనే తయారు చేయించాడు. అతని సైన్యాలు ఉపయోగించిన ఫిరంగులు మైసూరులోనే పోతపోయబడేవి. అవి బ్రిటిషువారి తుపాకులతో పోల్చినట్లయితే చాలా పెద్దవి, అవి పనితనములో గూడ శ్రేష్ఠమైనవి. కాల్బలము పాశ్చాత్యుల పద్ధతిలో తర్ఫీదు పొందింది. కాని టిప్పుసైన్యంలో ఉత్తరువులకి పారశీక పదజాలాన్ని వాడాడు. సైన్యాన్ని అతను కుషూన్, రిసాల్, జక్‌లుగా విభజించాడు. ప్రతి కుషూన్‌కు ఒక సిఫదార్, రిసాల్‌కు రిసాల్దార్, జక్‌కు జక్‌దార్ నాయకులు. వీరి క్రింద అధికారులు సర్కాయిల్, జమాదార్, దఫాదార్, యూజక్‌దార్ ప్రధానంగా చెప్పవచ్చు. హైదర్, టిప్పులు ఇద్దరు గూడ నౌకాదళ స్థాపనకై ప్రయత్నించారు. ఐరోపా సంకేతిక నిపుణుల సహాయంతో హైదర్ యుద్ధమునకు ఉపయోగిపడే దాదాపు 28 నుంచి 40 ఫిరంగులు అమర్చగల నౌకలను తయారు చేయించాడు. రెండవ మైసూరు యుద్ధ సమయంలో బ్రిటిషువారి చేతిలో అధిక భాగం నాశనము అయన తర్వాత, టిప్పు నౌకాదళాన్ని గట్టి పరచడానికి ప్రయత్నించకపోయినా, అతనివద్ద పెద్ద, చిన్న యుద్ధ వీరులనేకులుండేవారు. వీరు సముద్ర దొంగల బారినుంచి వర్తకులని రక్షించడానికై వినియోగించబడ్డారు. 1796 తర్వాత అతను పరిస్థితిని మెరుగుపరచ ప్రయత్నించాడు. నౌకావిషయాలు పరిశీలించడానికై ఒక మీర్ మాయ్ ఆధీనంలో కమిషన్‌ని ఏర్పరచాడు. అతని నౌకాదళంలో 22 యుద్ధనౌకలు, 20 పెద్ద ఫిరంగి నౌకలుండేవి. ఆ నౌకలు ఒక్కొక్కదానిలో 62 నుంచి 72 వరకు తుపాకులు అమర్చబడి వుండేవి.

మత విషయాలలో హైదర్ చాలా సహనాన్ని చూపాడు. టిప్పు మత విధాన విషయంలో చరిత్రకారులు వివాదాన్ని సృష్టించారు. టిప్పు మతోన్మాది అని విల్క్స్ అనే చరిత్రకారుడు వ్రాశాడు. హైదర్ అనుసరించిన మత సహన విధానాన్ని గూర్చి ఫాదర్ స్వార్ట్జ్ చాలా విపులంగా వివరించాడు. హైదర్‌కు స్వయంగా మతమంటూ ఏదీ లేదని అతను ప్రజల్ని తమకు నచ్చిన మతాలను అనుసరించుకొనే వీలు కల్పించాడనీ అతడు వ్రాశాడు. హైదర్ బ్రాహ్మణులకి ఇనాం భూములు ఇచ్చే పద్ధతిని కొనసాగించాడు, యీ పద్ధతిలో టిప్పు ఎలాంటి మార్పు చేయలేదు. యుద్ధానికై వెళ్లుటకు ముందు దైవాలయంలో పూజలు జరిపించాలన్న హిందూ సైనికుల అభిమతాలను గౌరవించటంలో హైదర్ శ్రద్ధచూపాడు.

1774 లో జరిగిన అగ్ని విపత్తులో రంగనాథ దేవాలయంలో కొంత భాగం నాశ నమైనప్పుడు హైదర్ దానిని ఒక నెల రోజులలో పునర్నిర్మించాడు. ఒక సమ యంలో ఒక మహమ్మదీయ ఫకీరు హిందువులు తన అనుయాయుల్ని హింసిం చారని, అందుచేత ఒక మహమ్మదీయ రాజ్యాధినేతగా హైదర్ హిందువులని హింసించ పగ తీర్చుకోవాలని కోరగా అందుకు హైదర్ యీ విధంగా ప్రశ్నిం చాడు. "ఇది ముల్లిం రాజ్యమని నీ కెవరు చెప్పారు?" టిప్పు వ్యక్తిగతంగా హైదర్ కన్న కొంత సనాతన వాదియైనా మత సహనవిషయంలో దాదాపు తండ్రి పద్ధతులని కొనసాగించాడు. పరశురాం బాహు ఆధీనములోని సైన్యంలో గల పిండారీలు శారదాదేవాలయ మందలి విగ్రహాన్ని ధ్వంసం చేయగా, దానిని బాగుచేయడానికై టిప్పు తగు ధనాన్ని శృంగేరి పీఠాధిపతి శంకరాచార్యులకు అందజేశాడు. టిప్పు శృంగేరీ పీఠాధిపతికి వ్రాసిన అనేక ఉత్తరాలని పరిశీలిస్తే అతనికి హిందూ మతము యెడల గల గౌరవము తెలుస్తుంది. అతను మతోన్మా దికాదని నిరూపించడానికి యిది చక్కని తార్కాణము. ఈ ఉత్తరాలు 1916 లో ఆర్. నరసింహాచారి అనే పండితునిచే కనుగొనబడినవి. అందు ఒక దానిలో టిప్పు ఒక సంస్కృతశ్లోకాన్ని ఉటంకించాడు. తన రాజ్యపు ఔన్నత్యానికి తన శత్రువుల విచ్ఛిన్నానికై ప్రార్థిచమని స్వామిక ఒక జత శాలువలు పంపాడు. మరి యొక పత్రము ప్రకారం టిప్పు అమ్మవారికి, స్వామీజీకి చెరి యొక పల్లకీని పంపాడు. ఈ జాబులు ఆ పవిత్ర స్థలంపట్ల, స్వామిజీపట్ల టిప్పుకు గల ఎనలేని గౌరవాన్ని తెలియజేయడమే గాక, టిప్పు మతోన్మాదియని హిందువులని హింసిం చాడని బ్రిటిషువారు చేసిన ప్రచారములో సత్యము రవ్వంతగూడ లేదని నిరూ పిస్తుంది. అతను అనుసరించిన ఆ పద్ధతి కేవలము మహారాష్ట్రులతో యుద్ధము చేయునప్పుడు మాత్రమే గాక తన పరిపాలనాకాలమంతటికీ వర్తింపజేశాడు. మరియొక సందర్భంలో శాంతియుత పరిస్థితులు నెలకొని వున్న సమయంలో స్వామీజీని జగద్గురువు అని సంబోధిస్తూ తన ప్రజల శాంతి సంతోషాలకై ప్రార్థిం చమని అభ్యర్థించాడు. టిప్పు పోషణ కేవలము శృంగేరీకి మాత్రమే పరిమిత ముకాలేదు. నంజనగూడ తాలూకాలోని కలాలె వద్దగల లక్ష్మీకాంత దేవాలయానికి అతను వెండి పళ్ళాలను, చెంబులు, ఇతర పూజాసామగ్రిని ఇచ్చాడు. మెల్కోటెలోని నారాయణ స్వామి దేవాలయానికి బంగారు, వెండి పాత్రలు కొన్ని బంగారు ఆబ రణాలతో బాటు ఒక ఏనుగును గూడ బహూకరించాడు. నంజనగూడలోని శ్రీవేం కటేశ్వర దేవాలయానికి వజ్రాలు పొదిగిన గిన్నెను, విలువైన ఆభరణాలనిచ్చిన

టిప్పు, శ్రీరంగపట్టణంలోని సంగనాధ దేవాలయానికి ఏడు వెండి గిన్నెలు, ఖరీదైన వెండితో చేయబడ్డ హారతి పళ్లాన్ని బహూకరించాడు. నంజనగూడలోని నంజుండేశ్వర దేవాలయానికి ఒక పచ్చని లింగము బహూకరించబడి అతని ఉత్తరువుల మేరకు అది ప్రతిష్ఠించబడింది. రంగనాథ దేవాలయము తన రాజ ప్రాసాదానికి చేతిరాయి విసురు దూరములో వుండటంచేత, అందులోనుంచి వచ్చే గంటల ధ్వనిని మసీదులో నుంచి ప్రార్థనకై మౌల్వీ చేసే పిలుపుని విన్నంత గౌరవ మర్యాదలతో వినేవాడు. టిప్పు. రాజప్రాసాదానికి చేరువగా మరి రెండు దేవాలయాలు, నరహింహ,గంగాధరేశ్వర ఆలయాలు గూడ వుండేవి. అక్కడ నిత్యం పూజలు కొనసాగేవి. టిప్పు వాటి విషయాలలో జోక్యము కలిగించుకొనేవాడు కాదు. కొట్టరాయ లోని దేవాలయాలు టిప్పునుంచి సహాయంపొందేవి. 1780 లో హైదర్ కర్ణాటక ప్రాంతాన్ని జయించిన సమయంలో కాంచీపురంలో గోపుర దేవాలయ నిర్మాణానికి పునాదులు వేశాడు, కానీ ఇది అతని జీవితకాలంలో పూర్తిగాలేదు. టిప్పు దానికై 10,000 రూకలను వెచ్చించి దానిని పూర్తిచేయించాడు. దాని నిర్మాణము పూర్తిఅయినప్పుడు జరిగిన రథోత్సవంలో కొన్ని పూజా విధానాలపై హిందువులలోని ఇరు వర్గాల వారు పేచీ పడగా, టిప్పు జోక్యము కలిగించుకొని నిష్పక్షపాతియైన మధ్యవర్తిగా ఆ తగాదాని, తీర్చగలిగాడు. అందుచేత టిప్పు మతోన్మాది అన్న కొందరు బ్రిటిషు చరిత్ర కారుల ఉద్దేశాలు సత్యదూరమైనవి అనవచ్చు. టిప్పు అందరియెడ సమానతను, న్యాయాన్ని అనుసరించాడు. అతను అనేక హిందువులను ఉన్నత పదవులలో నియమించటం, హిందూ దేవాలయాలకు బ్రహ్మణులకు, భూమును, బహుమానములను ఇవ్వటం గమనిస్తే అతనిలో మతసహనము లేదనే అపవాదు సత్యదూరమని స్పష్టమవుతుంది.

నేరములను శిక్షించుటకు టిప్పు అనుసరించిన పద్ధతి ఎంతో గమనార్హము. 1792 లో అతను ప్రవేశపెట్టిన క్రొత్త చట్టములలో ఒక నిబంధనలో క్రిందివింధగా తెలియజేయబడింది. "మీ మండలంలో శిక్షించబడ్డ రైతులు ప్రభుత్వానికి ప్రస్తుతము అపరాధము చెల్లించుచున్నారు. భవిష్యత్తులో యీ అపరాధముల పద్ధతి మార్చబడునని ఉత్తరువైనది. ఇక మీదట తప్పుచేసినవారు చెల్లించవలసిన ప్రతి పగోడాకు బదులు వారి ఊరికి వెలుపల రెండు మామిడి చెట్లని, రెండు జామ చెట్లని నాటి, అవి కొంత మేరకు పెరుగునంత కాలం నీరుపోయాలి," అని. న్యాయపాలనలోని యీ క్రొత్త విధానం వల్ల మైసూరు రాజ్యంలో ఒక రకమైన

"హరిత విప్లవం" సంభవించిందినవచ్చు. ఈ విషయంగా మూర్ ఇలా వ్రాశాడు. "ఎవరైనా క్రొత్త ప్రాంతంలో ప్రయాణిస్తూ అక్కడ మంచి వ్యవసాయం కొనసాగడం, సమర్థవంతంగా పనిచేసే ప్రజలుండడం, క్రొత్తగా ఏర్పాటయిన నగరాలు, విస్తరించే వాణిజ్యము, అభివృద్ధిచెందే పట్టణాలతో అన్ని రంగాలలోను సంతోషము తాండవించడం గమనిస్తే ప్రజల మనో బావాలకనువైన ప్రభుత్వము అక్కడ వుందనే నిర్ణయానికి వస్తాడు. ఇది టిప్పు రాజ్యములోని పరిస్థితి. అతని ప్రభుత్వమును గూర్చిన నా నిర్ణయము గూడ అదే."

టిప్పు ప్రభుత్వ పాలనావిధానములో అమిత శ్రద్ధ వహించాడు అనే విషయం తేట తెల్లము. తన మంత్రులు కేవలము సలహాదారులు మాత్రమే. రాచకార్యాలన్నిటినీ తాను స్వయంగా గమనించాడు. అతను విడుదల చేసిన నాణెముల ముద్రణలో తీసుకొన్న శ్రద్ధాసక్తులు అతనిలోని కళాత్మక అభిలాషలకి నిదర్శనము. నీటి పారుదల విషయాలలో అతను ప్రత్యేక శ్రద్ధవహించాడు. అతను తొమ్మిది మంది కమిషనర్లతో కూడిన వ్యాపారసంఘాన్ని నియమించడం, పదిహేడు విదేశీ, ముప్పై స్వదేశీ కర్మాగారాలను వారి ఉత్తరువుల మేరకు పని చేసేటట్లు స్థాపించటం, భూమార్గంగాను సముద్రముపైన కొనసాగిన ఎగుమతి, దిగుమతుల అభివృద్ధిచేత మైసూరుకి అమిత సంపద చేకూరింది. బ్యాంకుల వ్యవహారము, వడ్డీ వ్యాపారం మొదలగు వాటినతను ప్రభుత్వ గుత్తాధికారాలుగా ప్రకటించాడు. ఆక్రమణ సమయంలో అలాంటి సంపన్న పరిస్థితులు నెలకొని వుండటం బ్రిటిషు వారు చూసి ఆశ్చర్యపడడానికి అతని పరిపాలనా పద్ధతులు ఫలితము ప్రధాన కారణము.

# 9

# ముగింపు

చరిత్రలో టిప్పుకిగల స్థానము ఎంతో విశిష్టమైనది. స్వతహాగా అతనికి ఇతరులు యెడ అభిమానముండేది. సన్నిహితులని అతను భావించినవారిపట్ల అమిత వాత్స ల్యముండేది. అతనెప్పుడూ తొట్రుబాటు లేక ముందుజాగ్రత్తతో మెలిగేవాడు. అనవసరంగా ఎప్పుడూ క్రూరంగా ప్రవర్తించేవాడు కాదు. అతన్ని కూలద్రోయ డానికి ప్రయత్నించినట్టి వారిపట్ల దురుసుగా మాత్రం వ్యవహరించేవాడు. అతని క్రూరత్వం గురించిన వర్ణనలన్నీ అతిశయోక్తులు, అతని విమర్శకులు సృష్టిం చిన కట్టుకథలు మాత్రమే. అతను కొనగాగించిన అన్ని యుద్ధాలలో నీతి నిజాయి తీ, అధికారము, పలుకుబడి గలిగిన ఎవరూగూడా అతనిని వదలిపెట్టి శత్రుపక్ష మున చేరినవారు లేరు. తాను ఆఖరికి పతనము చెందేవరకు తన సైనికులు యుద్ధభూమిపై చూపిన క్రమశిక్షణ, నమ్మకము అతను తన ప్రజలపై తీసు కున్న శ్రద్ధాసక్తులకు ప్రబల నిదర్శనము. అతని ప్రభుత్వము ఖచ్చితంగా వ్యవ హరించినా, అది నిరపేక్ష నిరంకుశాధికారాన్ని స్థాపించింది. ప్రజా సహకారము లేని ఏ రాజు గూడ అతను కొనసాగించిన అన్ని యుద్ధాలను భరించి వుండలే డు. అతను తన సైన్యాలచే ప్రజలచే అభిమానింపబడ్డాడు. అధికారుల పట్ల సౌమ్యంగా వ్యవహరించేవాడు. వ్యక్తిగతంగా అతను గొప్ప ధైర్య గుణాలను ప్రదర్శించాడు. స్వయంగా గొప్ప సైనికుడు. ఈ గుణాలు అతను కల్నల్ బైయి లీనీ ఓడించటములో కల్నల్ వైట్‌ను త్రిప్పికొట్టడంలోను, 1786 లో మహరాష్ట్రు లపైన, నిజాంపైన జరిపిన మెరుపు దాడుల్లో మూడవ మైసూరు యుద్ధ సమ యంలో జనరల్ మెడోస్‌పై పోరాడిన పద్ధతుల్లో స్పష్టమవుతుంది. హైదర్ వలె గాక టిప్పు అనేక అంశాలపై క్షుణ్ణమైన అవగాహన సాధించాడు. ముఖ్యంగా సూఫీ సిద్ధాంతముని అభ్యసించాడు. అతని పోషణ క్రింద అనేక గ్రంథాలు రచింపబడ్డాయి. విజ్ఞాన శాస్త్రము, వైద్యము, మతము, కళలు, సైనిక విషయా

లు-దాదాపు అన్ని శాస్త్రాలు అతని దృష్టిని ఆకర్షించాయి. మిల్ అన్నట్లు ఒక ఆసియా రాజు దృష్టిలో అతను గొప్ప జ్ఞాననిధి. అతని మేధస్సు ఎప్పుడూ నిర్విరామంగా వుండి సదా చైతన్యంతో నిత్య నూతనంగా ప్రయోగాత్మక అభిలాష కలిగివుండేది. అతనికి క్రొత్తది కనిపెట్టాలనే కుతూహలం వుండేది. అందులో అతణ్ణి అక్బరుతో పోల్చవచ్చు. కొన్ని ఆశ్చర్యకరమైన వాణిజ్య ప్రయోగాలను చేపట్టాడు. నాణెములు, టంకశాల; కొలతలు, తూనికలు; బ్యాంకులు, ఆర్థిక విధానాలు; శిస్తు విధానము న్యాయపాలన; సైన్యము, నౌకాదళము, నీత నియమాలు-వీటిలో అతను తెచ్చిన సంస్కరణలు అతనికి అత్యున్నత స్థానాన్ని అపాదించాయి. అదే విధంగా అతని కాలంలో మైసూరు అనేక పెద్ద నౌకలు, ఫిరంగి నౌకలు, తీర ప్రాంతపు పడవలతో ఒక పెద్ద నౌకాదళాన్ని కలిగినదన్నది కొద్ది మందికి మాత్రమే ఎరుక. అతని రాజ్యంలో మూడు పెద్ద నౌకా నిర్మాణ కేంద్రాలు, నావికులకు శిక్షణ యివ్వడానికై ఒక నావికా పాఠశాల స్థాపించబడ్డాయి. పాశ్చాత్య పద్ధతులని తన పరిపాలనా విధానములో అమలుజరిపిన మొదటి భారతీయ పాలకుడైన టిప్పు చాలా పటిష్టమైన పాలనా వ్యవస్థని నిర్మింపజేశాడు. పండించే రైతుకై భూమి చెందుతుందనే పద్ధతిపై ఆధారపడిన భూ అమరిక విధానాన్ని అనుసరించటంచేత, బంజరు భూములను శిస్తు మినహాయింపుపై రైతులకివ్వటం వల్ల భూమిశిస్తు వసూలుకై మధ్య వర్తుల నియామకాన్ని తొలగించి వారిస్థానే రెవిన్యూ అధికారుల నియమించటం, అధికారులకి జాగీరులిచ్చే పద్ధతిని రద్దు చేసి వారికి జీతములను ధనరూపములో చెల్లించుట మున్నగు అనేక సంస్కరణలచేత రాజ్యములో వ్యవసాయము ప్రోత్సహించబడింది. తన యీ ప్రయత్నాల ఫలితంగా మైసూరు సంపన్నమైన అభ్యుదయరాజ్యంగా రూపొందింది.

ా టిప్పు హిందూ సాధువుల, సన్యాసుల, దేవుళ్ళను గౌరవించాడు. శృంగేరి గురువుకి అతను వ్రాసిన జాబులు దీనిని తెలియజేస్తాయి. అతను బ్రాహ్మణులకు అన్నదానాలుచేసి, హిందూమతోత్సవాలకైన ఖర్చులను భరించి, దేవాలయాలకు విరివిగా సహాయాన్ని అందజేసాడు. అతని విమర్శకుల మాత్రం అతన్ని మతోన్మాది అని విమర్శించారు. అతను కూర్గులో హిందువులని, మలబారులో నాయర్లని అణచినాడన్న దానికి రాజకీయాలు కారణాలు. వారు బ్రిటిషువారి పక్షం వహించారు గనుక. అతని మతస్థులే అలాంటి అకృత్యాలకు దిగిన వారిని గూడ తప్పక అదే పద్ధతిలో శిక్షించివుండేవాడు. మొప్లాలు, మహదేవిలు, కర్నూలు

సావనూరు నవాబులు-అందరూ ఆ విధంగా శిక్షించబడ్డవారే. మహారాష్ట్రులకన్న నిజాం పట్ల అతను ఎక్కువ వైరాన్ని కనపరచాడు. టిప్పు ప్రభుత్వంలో పూర్ణయ్య చాలా ప్రధానమైన స్థానాన్ని ఆక్రమించుకొన్నాడు. అందువల్ల టిప్పుని అసహనము గలిగిన వాడని తప్పుపట్టడం సమంజసం కాదు.

అతని గుణగణాల్లో అతి విశిష్టమైంది బ్రిటిషువారి ఎడ అతనికి గల వైషమ్యము. భారతదేశంలో బ్రిటిషువారు ఎదుర్కొన్న శత్రువులందరిలోను టిప్పు అతి సమర్థవంతుడు. "ఎట్టి దయాదాక్షిణ్యము గూడ రాజీ పనికిరాని, ఎటువంటి నమ్మకము గూడ చేరువకు తేలేని" బద్ధ విరోధి, అని బ్రిటిషువారు భావించారు. వారి సామ్రాజ్య వ్యాప్తిలో భారతదేశ సార్వభౌమత్వానికి గల ముప్పుపై అతనికె లాంటి సందేహములేదు. వారి దాస్యశృంఖలాలనుంచి భారతదేశాన్ని రక్షించడానికై నిత్యం యోచించాడు. స్వప్నంలో గూడ వారిలో జరుపుతున్న చావు బ్రతుకుల పోరాటాన్ని మరచేవాడు కాదు. తన ఆధీనమంలోగల అధికారము, సంపత్తిని పూర్తిగా వినియోగించి, కార్యదీక్షతో తన అభీష్టాన్ని కొనసాగించాడు. అతని అపజయానికి అదుపులోలేని సందర్భాలు కారణాలు గాని అతినిలో ఉత్సహము లోపించిగాని, ధైర్య సాహసాలలో సడలింపుగాని కారణాలు గావు. భారదేశంలోని ఒక రాజ్యానికి వ్యతిరేకంగా ఏ విదేశంతోనూ అతను చేతులు కలపలేదు. అతను మహారాష్ట్రులని నిజాంని సంఘటిత పరచడానికి పదే పదే ప్రయత్నించాడు. కాని తన అభీష్టాన్ని వారు హర్షించలేదు. అందుచే ప్రాణభీతిలేక, తాను అనుకొన్నది ఏకాకిగానే కొనసాగించి సాధించదలచాడు. 1792 లో బ్రిటిషువారు తన రాజ్యంలో అర్థ భాగాన్ని లాక్కోవడంతో ప్రతీకారవాంఛ మరీ ఎక్కువైంది. ఆంగ్లేయులు అతను బ్రతికివున్న కాలమంతా రక్షణ కోల్పోయినట్లే భావించారు. అతని మరణము తర్వాతనే వారు "భారతదేశం మనది" అని సంతోషంగా చెప్పుకొనగలిగారు.

ఆ విధంగా టిప్పు పాలనాకాలం కొద్దిదే అయినా భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్య విస్తరణని అరికట్టే విషయంలో అది కారుమేఘాల మధ్య అవుపించిన సన్నని మెరుపు తీగ అని అనిపిస్తుంది. విరుచుక పడిన విదేశీయులని బెబ్బులి ధైర్యంతో వేట కుక్క పట్టుదలతో ఏకాకిగా నిలబడి ఎదుర్కొన్నవాడు. జూలియస్ సీసర్ విరోధి మోసానికి ఆహుతియైనట్లు టిప్పు గూడ చివరికి ఆహుతయ్యాడు. కానీ బ్రిటిషువారి దౌత్యము వారి బలాధిక్యత ఎదుట భారత రాజులలో లోపించిన ఐక్యత, దీనిచే కలగే అవాంతరాలను మాత్రం గుర్తుచేయడాన్ని

మరువలేదు. తనవరకు తాను ఎప్పుడూ ఆశ్రయాలతో రాజీపడలేదు. తన లక్ష్యాన్ని విడనాడలేదు. తనకు గల శక్తినంత వెచ్చించడానికి వెనుకాడలేదు. రాజకీయ బానిసత్వానికి బదులు మరణాన్ని కోరుకొన్నాడు. అతని పరిపాలనలోని అన్ని అంశాలలోకి ఇది ఎంతో ఆదర్శవంతమైనది. అతి ప్రధానమైంది. బ్రిటిషువారిని దేశసంనుంచి తొలగించడం అతని జీవితలక్ష్యం. ఈ లక్ష్యసాధనకై తన సొమ్మునీ, శక్తినీ, అధికారాన్నీ చివరికి తన ప్రాణాన్ని గూడ వెచ్చించడానికి వెనుకాడలేదు. నక్కలాగ నూరేండ్లు జీవించడానికన్న సింహం వలె ఒక్కరోజు జీవించడమే మేలన్న భావన మాతృదేశాన్ని ప్రేమించే ప్రతి ఒక్కరికీ మననీయము, ఆచరణీయము గూడ.

Lasertypeset at UNIQUE Graphics. 2/3 Old Rajinder Nagar. New Delhi - 60
and printed at JJ Offset Printers. Press Area. Wazirpur. Delhi - 110035